మంత్రోపాసన-అర్హతలు-నియమనిష్ఠలు-ఉపాసన క్రమవిధానము
మొదలగు అనేక మంత్రశాస్త్ర రహస్యములు సాధకులు తెలుసుకోదగిన

# మంత్రానుష్ఠాన చంద్రిక







## విషయసూచిక








## ప్రస్తావన

శ్లో॥ సంసారార్ణవ సంమగ్నం నరం యస్తారయే న్మనుః ।
సయేవ స్తారక స్తత్ర మహామంత్రః ప్రకథ్యతే ॥

మానవులను సంసారమనే మహాసముద్రమునుండి దాటించి జన్మజరా మృత్యు దఃఖములనుండి తప్పించుట కొరకు భగవత్ప్రేరణచే మహర్షులు మంత్రశాస్త్రమును వెలికితెచ్చియున్నారు. మంత్రములు దానికి సంబంధించిన ఉపాసనా విధానములు అనేక తంత్రములుగా రూపొందినవి. మరియు ఋషిప్రోక్తములగు సంహితలుకూడా ఈ విషయములనే ప్రతిపాదించు చున్నవి.

శ్లో॥ సకామోభుక్తి మాప్నోతి నిష్కామో ముక్తిమేవచ ।
ప్రాప్నోత్యుభయ కామశ్చే ద్భుక్తిం ముక్తిం న సంశయః ॥

యని అగస్త్య సంహితయందు కోరికలనుద్దేశించి ఉపాసనజేయు వారికి వారి కోరికలయొక్క ఫలసిద్ధియు, నిష్కాములై ముక్తికొర కనుష్ఠించు వారికి ముక్తియు, మంత్రముల నుపాసించుటవల్ల ప్రాప్తించగలవని దెలుపబడినది. మరియు పరమేశ్వర ప్రీతిగా ప్రతిదినము మంత్రజపమును జేయుచుండుటవల్ల-

శ్లో॥ దైనందినంతు దురితం పక్షమాసర్తు వర్షజం ।
సర్వం దహతినిశ్శేష మూర్ణా చల వివానలః ॥

సంవత్సర, మాస, ఋతు, పక్ష ప్రాధాన్యముగా జేసిన పాపములే కాక ప్రతిదినము తెలిసి తెలియకచేయు పాపములన్నియు దూదికొండ అగ్నిచే దహించబడిన విధముగా నిశ్శేషముగా దహించబడగలవు.

మంత్రములనేకవిధములు, ఏమంత్రమైనను ఆ అవ్యక్త పరబ్రహ్మము నాశ్రయించియే యుండుసు. విద్యుత్ ఒక్కటే అయినా వివిధరూపములతో ప్రకాశించి పలువిధములగు పనులు నెరవేర్చుచున్నట్లు భగవత్‌శక్తి ఒకే కేంద్రస్థానమునుండి వెలువడి ఆయా ఫలితములు నెరవేర్చుటకొరకు వివిధ మంత్రములుగా రూపముజెందినవి. కావున మంత్రభేదము లెన్నియున్నను -మంత్రత్వ మొక్కటియే యని గ్రహించవలెను. అట్టి మంత్రములను సాధన








## ప్రస్తావన

శ్లో॥ సంసారార్ణవ సంమగ్నం నరం యస్తారయే న్మనుః ।
సయేవ స్తారక స్తత్ర మహామంత్రః ప్రకథ్యతే ॥

మానవులను సంసారమనే మహాసముద్రమునుండి దాటించి జన్మజరా మృత్యు దఃఖములనుండి తప్పించుట కొరకు భగవత్ప్రేరణచే మహర్షులు మంత్రశాస్త్రమును వెలికితెచ్చియున్నారు. మంత్రములు దానికి సంబంధించిన ఉపాసనా విధానములు అనేక తంత్రములుగా రూపొందినవి. మరియు ఋషిప్రోక్తములగు సంహితలుకూడా ఈ విషయములనే ప్రతిపాదించు చున్నవి.

శ్లో॥ సకామోభుక్తి మాప్నోతి నిష్కామో ముక్తిమేవచ ।
ప్రాప్నోత్యుభయ కామశ్చే ద్భుక్తిం ముక్తిం న సంశయః ॥

యని అగస్త్య సంహితయందు కోరికలనుద్దేశించి ఉపాసనజేయు వారికి వారి కోరికలయొక్క ఫలసిద్ధియు, నిష్కాములై ముక్తికొరకు కనుష్ఠించు వారికి ముక్తియు, మంత్రముల నుపాసించుటవల్ల ప్రాప్తించగలవని దెలుపబడినది. మరియు పరమేశ్వర ప్రీతిగా ప్రతిదినము మంత్రజపమును జేయుచుండుటవల్ల-

శ్లో॥ దైనందినంతు దురితం పక్షమాసర్తు వర్షజం ।
సర్వం దహతినిశ్శేష మూర్నా చల వివానలః ॥

సంవత్సర, మాస, ఋతు, పక్ష ప్రాధాన్యముగా జేసిన పాపములే కాక ప్రతిదినము తెలిసి తెలియకచేయు పాపములన్నియు దూదికొండ అగ్నిచే దహించబడిన విధముగా నిశ్శేషముగా దహించబడగలవు.

మంత్రములనేకవిధములు, ఏమంత్రమైనను ఆ అవ్యక్త పరబ్రహ్మము నాశ్రయించియే యుండుసు. విద్యుత్ ఒక్కటే అయినా వివిధరూపములతో ప్రకాశించి పలువిధములగు పనులు నెరవేర్చుచున్నట్లు భగవత్‌శక్తి ఒకే కేంద్రస్థానమునుండి వెలువడి ఆయా ఫలితములు నెరవేర్చుటకొరకు వివిధ మంత్రములుగా రూపముజెందినవి. కావున మంత్రభేదము లెన్నియున్నను -మంత్రత్వ మొక్కటియే యని గ్రహించవలెను. అట్టి మంత్రములను సాధన

జేయుటకు కొన్ని అర్హతలు చాలా అవసరము. వృత్తి ఉద్యోగములు పొందుటకు పలురకములైన విద్యార్హతలు ఏవిధముగా అవసరమో? అదే విధముగా మంత్రోపాసన గావించుటకు కూడా కొన్ని అర్హతలు మహర్షులు తెలిపియున్నారు. శాస్త్రాభ్యాసమునకు కావలసిన అర్హతలు-వైదికపరమగు కర్మ విశేషములు, మంత్రస్వరూపము, దీక్షాపద్ధతులు, ఉపాసనాంకములగు ఇతర రహస్య విషయములు, గురువుయొక్క ప్రాధాన్యత, జపలక్షణము, మంత్ర సంస్కారము మొదలగు విషయము లీ గ్రంథమునందు దెలుపబడు చున్నవి.

మంత్రశాస్త్రమొక "కల్పవృక్షము" అది ఎవ్వరూ కాదనలేని నిజము! అయితే ఆ కల్పవృక్షమును అందుకోవటానికి ఈ మానవశరీరముకు అర్హతకదా? కావుననే మానవజాతి శ్రేయస్సు నాకాక్షించిన ఋషిలోకము నిరంతర పాపపంకిలమగు మానవదేహమును ఆచరణ-నియమము, నిష్ఠ, యాగము, ప్రాణాయామము, న్యాసము మొదలగు విధానముల ద్వారా సంస్కరించుకొని దైవత్వముగా తీర్చిదిద్దుకొనుటకు మార్గములను దెలిపి యున్నారు. ఇందు ఏకాశీతిన్యాసములద్వారా శరీరమునకు దేవతా భావసిద్ధి కలుగగలదని ఈ క్రింది "తంత్రసార" ప్రమాణము స్పష్టపరచుచున్నది.

**శ్లో॥ అథన్యాసాన్ ప్రవక్ష్యామి తానేకాశీతి సంజ్ఞికాన్ ।**
**దేవతాభావ సిద్ధ్యర్థం సాధకానాం చ మంత్రిణామ్ ॥**
**ఆగమోక్తమార్గేణ న్యాసా న్నిత్యం కరోతియః ।**
**దేవతా భావమాప్నోతి మంత్రసిద్ధిః ప్రజాయతే ॥**

మహర్షులు తెలిపిన మార్గములు సంప్రదాయముల ననుసరించి మంత్రాంగములగు ఏకాశీతి న్యాసములను నిత్యము నాచరించు చుండుట వలన ఈ మానవ దేహము దాని నాశ్రయించిన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ ములు, మనోబుద్ధులు, కూడా దైవతత్వమును పొందగలవు. తద్వారా "మంత్రసిద్ధి" యను దేవలోకమునందలి కల్పవృక్ష ఫలమును శీఘ్రముగా పొందగలరు. అట్లుగాక గురుమార్గముగానీ, సంప్రదాయముగానీ, దీక్షన్యాస విధానముల్లుగానీ లేకుండా మంత్రములను కోట్లకొలది జీవితాంతము జపించినను కించిత్ ఫలితముకూడా కలుగదు. ఈ విషయము ప్రతివారు గ్రహించవలసియున్నది.



మంత్ర, యంత్ర, తంత్ర శాస్త్రములను తెల్పు గ్రంథములు అనేకము లున్నవి. అట్టి గ్రంథములు కేవలం మంత్రమువల్ల కలుగు ప్రయోజనములనే తెలుపునవైయున్నవి. కొన్ని ఉద్గ్రంథములందు అనుష్ఠాన విధానములున్నను సమగ్ర వివరణములుండవు. అట్టి రహస్య విషయములను గ్రంథములందు వ్రాసి బహిర్గతము చేయరాదను శాస్త్ర నియమమున్నది. కావున ఏ గ్రంథకర్తయు వాటిని (తెలిసికానీ-తెలీకకానీ) తెలుపుట అసంభవము. అట్టి శాస్త్రీయములగు రహస్య ఆచరణా విధానములు, ఉపాసనాకర్మములు, యోగ్యుడు, అనుభవజ్ఞుడునగు గురువుద్వారా తెలుసుకొనవలెను. పుస్తకములు చూచి మంత్రముల నభ్యాసము (మంత్ర-తంత్రములుకూడా) చేయుట మిక్కిలి హానికరమని పాఠకులెల్లరు గ్రహించగలరు. సంగీతం, చిత్రలేఖనం, వడ్రంగం, గృహనిర్మాణం, వివిధ మోటారు వాహనములను నడుపుట మొదలగునవి గురువుద్వారా నేర్చుకొని సాధనజేయుటవల్ల పరిపూర్ణత సిద్ధించినట్లే! మంత్ర,యంత్ర, తంత్ర శాస్త్రములు వేదముకూడా సుశిక్షణకల్గిన గురువువద్ద నభ్యసించి నిరంతర సాధన జేయుచుండుటవల్ల సత్ఫలితములు ప్రాప్తించగలవు. కావున విధిగా సద్గురువు నాశ్రయించుట యుక్తము.

## గురువులేని విద్య నిష్ఫలము మరియు హానికరము

గతంలో మేమువ్రాసిన మంత్ర, యంత్ర,తంత్ర, శాస్త్రగ్రంథములు పాఠకులు ఆచరించుటకు ఉద్దేసించబడినవికావు. సంస్కృత బాషయందే నిక్షిప్తమై తెలుగుచూడని మన పురాతన హైందవ సంస్కృతి ఇట్టిది అని తెలుగు పాఠకులకు కొంతవరకు తెలియజెప్పు తలంపుతో వ్రాసినవి మాత్రమే! గ్రంథములద్వారా అవగాహన, గురువుద్వారా ఆచరణ దృఢతరమగు దీక్షద్వారా సాధన, దైవానుగ్రహముద్వారా ఫలసిద్ధి కలుగగలవు. "షడ్భిర్మనుష్య యత్నానాం-సప్తమందైవచింతనం" యను పెద్దల వాక్యానుసారముగా మానవు డెన్ని విధములుగా ప్రయత్నించినను దైవ నిర్ణయములేనిదే ఏకార్యముకూడా సిద్ధించదు. పూర్వజన్మయందలి సుకృతము (పుణ్యము) తల్లిదండ్రుల సుకృతము యోగ్యమైననేగానీ మానవుడు ఉన్నతుడు శక్తిమంతుడు, సంకల్పసిద్ధుడు కానేరడు. ఈ గ్రంథకర్త కేవల విషయాను వాదకుడు మాత్రమే! మంత్రాది శాస్త్రవిషయములను గురించి వీరిని సంప్రదించ వలదని ప్రార్థన.

ఇట్లు - గ్రంథకర్త

# మంత్రానుష్ఠాన చంద్రిక

## ఆచార క్రమము

**శ్లో॥ ఆచారాద్విచ్యుతోవిప్రో నవేద ఫలమశ్నుతే ।
ఆచారేణతు సంయుక్తః సంపూర్ణ ఫలభాగ్భవేత్ ॥**

ఆచారమనునది జాతీయ సంప్రదాయబద్ధము స్మృతి ప్రమాణికమునైన యెుక దైనందిన కర్మకాండ ఇట్టి యాచారమును పాటింపనిదే వేదచోదితములగు ఇహపరకర్మ లెవ్వియు ఫలింపవని పై ప్రమాణముద్వారా స్పష్టమగుచున్నది.

ఈ ఆచారవర్తనము : 1. దివ్యాచారము, 2. దక్షిణాచారము, 3. వామాచారము, 4. లౌకికాచారము, 5. దేశాచారమని ఐదు విధములుగా తెలుపబడినది. ఇందు దివ్యాచారమనునది అష్టాంగలక్షణ లక్షితమైన యోగవిద్యచే దివ్యత్వమునందిన తపోపరతంత్రులగు ఋషులకు సిద్ధులకు ఆచరణీయమైయున్నది. దక్షిణాచారమనునది గృహస్థాశ్రమ ధర్మవర్తునులైన వైదిక సంప్రదాయికుల కెల్లరకు నాచరణీయము. వామాచారము క్షుద్రకర్మాసక్తులైన తామస-రాక్షస ప్రవృత్తిగలవా రవలంబించునదైయున్నది. లౌకికాచారము వైదిక కర్మాసక్తులయ్యు వృత్తి ధర్మముల ననుసరించి దక్షిణాచారవిహితము ప్రవర్తింపజాలని వారి విషయమై తెలుపబడినది. ఇక దేశాచారమనునది ఆయా ప్రాంతముల ననుసరించి ఏర్పడు ప్రాంతీయ ధర్మములుగా పరిగణించబడుచున్నవి.

**శ్లో॥ జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః ।
వేదశాస్త్రంతువిప్రాణాం బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః ॥**

జననాదిగాగల శూద్రత్వము (అజ్ఞానము) సంస్కారయుతమగు కర్మలచేత శ్రుతి-స్మృతి విహితములగు కర్మాచరణవలన దొలగిపోయి ద్విజత్వము ప్రాప్తించుచున్నది. ద్విజత్వసిద్ధి కుపనయనమే అంకురారోపణ మగుచున్నది. వైదికాచార ప్రవర్తకులగుటకు ఉపనయన సంస్కారమే మొదటి అర్హతగా గుర్తించవలెను.



ఉపనయన సంస్కారము-అందలి బ్రహ్మోపదేశములద్వారా ద్విజులైన వారు వేద-శాస్త్రముల నభ్యసించి వాటియొక్క అర్థసారములను గ్రహించి నందువల్ల విప్రత్వసిద్ధి నందగలరు. పూర్వపుణ్య వశముచేతగానీ అలవడని వేదశాస్త్రాదులసారమైన బ్రహ్మపదార్థముయొక్క యునికిని గ్రహించి జ్ఞానవంతులైనవారే బ్రాహ్మణు లనబడుచున్నారు. ఈ విధమైన బ్రాహ్మణత్వము నందుటకు మానవులాచరించవలసిన సత్కర్మలనేకములున్నవి. అట్టి సత్కర్మల యొక్క సంపూర్ణ ఫలము సమగ్రముగా సిద్ధించుటకే ఆచారవిధు లుపదేశింప బడినవి.

## షట్కర్మ ప్రశస్తి

**శ్లో॥ సంధ్యాస్నానం జపోహోమో దేవతానాం చ పూజనం
ఆతిథ్యం వైశ్వదేవం చ షట్కర్మాణి దినే దినే ॥**

సత్కర్మసిద్ధి కాచరింపదగిన విధులలో ఆరువిధములగు ముఖ్యకర్మలు తెలుపబడినవి. 1. సంధ్యాస్నానము, 2. జపము, 3. హోమము 4. దేవతార్చనము 5. అతిథిపూజ 6. వైశ్వదేవము అనునవి షట్కర్మలు. వీనిలో సంధ్యాస్నానము లతిప్రాధాన్యత నందియున్నవి. సంధ్యకు స్నానము అంగభూతమైనది. ఈ స్నానమును ఉషఃకాలమునందాచరించవలెను.

**శ్లో॥ పంచపంచ ఉషఃకాలః సప్త పంచారుణోదయః ।
అష్టపంచ భవేత్ప్రాతః శేష స్సూర్యోదయోమతః ॥**

సూర్యోదయమునుండి 55 ఘడియలకు ఉషఃకాల మేర్పడగలదు. అట్టి ఉషఃకాలమునందే స్నానమాచరింపవలెనని శాస్త్రములు దెల్పుచున్నవి. దీనినే నిత్యస్నానముగా పండితులు బేర్కొనియున్నారు. నైమిత్తికకర్మలు అనగా గ్రహణ- పర్వ తీర్థాతులయందున, ఒకపనికొరకు నిర్దేశింపబడిన స్నానము నైమిత్తిక స్నానముకాగలదు. నిత్యస్నానము నందైదు విధానములు తెలుపబడినవి. 1. జలస్నానము సంకల్ప పూర్వకముగా వారుణాఘమర్షణ మంత్రములతో నదీప్రవాహాది జలములందు స్నానమాచరించుట. 2. అమృతస్నానము, వర్షించు సమయము నందు ఆ వర్షముచే స్నానము గావించుట. 3. మంత్రస్నానము, మార్జన మంత్రములచే జలములు

## సంస్కారము - కర్మలు

తప్పక చేయవలయునని వేదమంత్రములచే కలుగు పుణ్యకర్మచేత జీవునియొక్క భౌతికకాయమును బాగుపరచి శుద్ధియొనరించునది సంస్కారము. ఇందువలన మనస్సు పరిశుద్ధమై జ్ఞానాభ్యాసమునకు యోగ్యము కాగలదు. వ్యాసుడీ సంస్కారములు పదునారుగా దెల్పియున్నాడు. ఆంగీరసుడు ఇరువది ఐదుగాను, గౌతముడు నలుబదిగాను దెల్పినప్పటికీ ఇవి అన్నియు వ్యాసుని షోడశ సంస్కారములలో నంతర్భాగములుగానే యున్నవి.

వ్యాసుడు దెల్పిన షోడశ సంస్కారములలో మొదటి ఎనిమిది సంస్కారములు ప్రవృత్తి మార్గమును తరువాత ఎనిమిది సంస్కారములు నివృత్తి మార్గమును బోధించునవైయున్నవి. జీవుడీ పదునారు సంస్కారములతో సంస్కరింపబడినవాడై పరిశుద్ధాంతః కరణకల్గి జీవభ్రాంతిని విడచి పరిపూర్ణ వస్తు గ్రహణముచే పూర్ణుడై బ్రహ్మ తాదాత్మ్యము నందగలడు.

**కర్మ** : అనాది శిష్ట సాంప్రదాయక వ్యవహారము ననుసరించి సుఖ–దుఃఖ ఫలసాదన భూతములైన చేష్టా వికారములే కర్మలని దెలియవలెను. ఇందు సుఖసాధనమగు కర్మలు రెండువిధములు. 1. శ్రౌతకర్మ హవిర్యజ్ఞాది సోమయాగ సంస్థాంతమువరకు గల కర్మలు. 2. స్మార్త కర్మ – గర్భాదానాది పాక యజ్ఞాంత సంస్థలవరకు గల కర్మలు. ఈ కర్మలన్నియు గౌతమ ఋషిదెల్పిన నలుబది సంస్కారములందు జేరియున్నవి. మరియు నీ కర్మలు 1. నిత్యము 2. నైమిత్తికము 3. కామ్యము 4. నిషిద్ధము 5. ప్రాయశ్చిత్తము అను పంచవిధ భేదములు కల్గియున్నవి.

స్నాన సంధ్యావందనౌపాస నాషణ్ణవత్యాది యజ్ఞకర్మలు నిత్య కర్మలు, గ్రహణ, పర్వ, శ్రాద్ధ, వ్రతాదికర్మలు, నైమిత్తికకర్మలు, దశదానాది దానములు, ఇష్టాపూర్తములు, ధర్మశాల తటాక వనదేవతా ప్రతిష్ఠాదికర్మలు, కామ్యకర్మలు, శ్రుతి స్మృతులచే నిషేధించబడిన కర్మలు నిషిద్ధకర్మలు, (అసత్య, పరదారాగమన సురాపానాదులు) తెలియకయు, (తెలిసియు) జేసిన ప్రతిషిద్ధకర్మల యొక్క దోషములను పరిహరించుట కాశరించబడు చాంద్రాయణాది వ్రతములు, కృచ్ఛ్రములు, నక్షత్ర గాయత్రీ జపాదులు మొదలగునవి ప్రాయశ్చిత్తకర్మ లనబడును.



## వస్త్రధారణ

**శ్లో॥ అష్టహస్తం నవం శ్వేతం సదశం ధౌతమంబరం ।**
**శుష్కంచ ధారయే దివిద్వాన్ సర్వకర్మ సుపావనం ॥**

స్నానానంతరము దేవతాఋషి పితృతర్పణములనొనర్చి సూర్యుని కర్ఘ్య ప్రదానముగావించిన పిమ్మట ఒడలు తుడుచుకొని పరిశుభ్రమైన వస్త్రములు ధరించవలెను. ఈ వస్త్రము ఎనిమిదిమూరల పొడవుగల్గి అంచుతో గూడి తెల్లనిదిగా నుండవలెనని ధర్మ ప్రవృత్తి దెల్పుచున్నది. దీనిని అంతకుపూర్వమే తడిసి ఆరవేసివుంచవలెను. తడి వస్త్రము ధరించి దేవతాకర్మలు చేయుట నిషిద్ధము. మరియు నగ్నముగాగానీ నగ్న సాదృశ్యముగాగానీ వైదికకర్మలు నిర్వర్తింపరాదు.

**శ్లో॥ అపవిత్ర పటో నగ్నో నగ్నశ్చార్ద్ర పటవృతః ।**
**నగ్నశ్చ మలినోద్వాసీ నగ్న ః కౌపీనవానపి ॥**

**శ్లో॥ కాషాయవసనో నగ్నో నగ్నశ్చా నుత్తరీయవాన్ ।**
**అంతః కచ్ఛోబహిః కచ్ఛో ముక్తకచ్ఛ స్తథైవచ ॥**
**సాక్షాన్నగ్న స్సవిజ్ఞేయో దశనగ్నా ః ప్రకీర్తితాః ॥**

అపవిత్రము – మలినమునైన వస్త్రములు ధరించుట, తడివస్త్రములు గట్టుట, గోచీమాత్రమే పెట్టుకొనుట, కాషాయ వస్త్రములు ధరించుట, శిఖలేకుండుట, ప్రమాణమున కంటెను అధికముగాగానీ, తక్కువగా గానీ శిఖయుండుట, శిఖనుముడివేయకుండా విడచివుంచుట అను పది విధములైన కృత్యములు నగ్నసాదృశములుగా పేర్కొనబడినవి.

**నీలీ రక్తం తు యద్వస్త్రం దూరతః పరివర్జయేత్ ॥**

అని దెల్పియుండుటవలన యోగ్యమగువస్త్రమే అయినను ఎరుపు – నీలి వర్ణములు గల్గియున్న వైదిక సాంప్రదాయమునకు దూష్యములగుచున్నవి.

**శ్లో॥ సద్యః ప్రక్షాళితం చేలమభావే శుష్కవాసనః ।**
**వాతేనోత్తపనం కృత్వా సప్తదాతచ్చ ధారయేత్ ॥**

పూర్వమే ఆరవేసిన శుచిగల వస్త్రము అభావమైనప్పుడు తడి వస్త్రమును సూర్యునికెదురుగా ఏడుపర్యాయములు విదలించినయెడల అది ఆరిన వస్త్రతుల్యము కాగలదని గౌతమాది ఋషులు దెల్పియున్నారు. క్రితముదినమునందారవేసిన వస్త్రము మరుదినము సూర్యోదయమునుండి ఏడు ఘడియలవరకు శుచిగా నుండగలదు. పట్టువస్త్రము తడపనంత కాలము శుచియై నుండును. ఒకమారు తడిసిన పట్టువస్త్రము భోజనము చెయ్యనంతవరకు పదిదినములైనను యోగ్యముగా నుండగలదు. పట్టు వస్త్రముతోటి భోజన మొనర్చిన దానిని తడిపి ఆరవేసిన పనికివచ్చును. ధావళి సర్వకాల సర్వావస్థలయందు శ్రేష్ఠమైయున్నది.

**శ్లో॥ స్త్రీణాం క్రీడార్థ సంభోగేశయనీయే న దుష్యతి భృగు ॥**

**శ్లో॥ ఆవికంతు సదావస్త్రం పవిత్రం రాజసత్తమ ।**
**పితృదేవ మనుష్యాణాం క్రియాయాం చ ప్రశస్యతే**
**ధౌతాధౌతం తథా దగ్ధం సంధితం రజకాహృతం ।**
**రక్తమూత్ర శకృలిప్తం తథాపి పరమంశుచి ॥**
**రేతః స్పృష్టం రజః స్పష్టం స్పృష్టం మూత్ర పురీషయోః ।**
**రజస్వలాభి సంస్పృష్టం మావికం సర్వదా శుచిః ॥**

ధావళి చాలా ప్రశస్తమైనది. ఇది పితృదేవ మనుష్యులకు సంబంధించిన కర్మలకు యోగ్యమైనది. ధావళి ఏరంగు కలిగి యున్నను, దహింపబడినను, అతుకులు వేయబడినను, చాకలిచే ఉతుకబడినను, రక్త, మూత్ర పురీషములచే స్పర్శింపబడినను రేతస్సుచేగానీ, బహిష్టు రక్తముచేగానీ సంబంధము గల్గినను, బహిష్టుస్త్రీలు ముట్టుకొన్నను కూడా ఈ ధావళి అన్ని వేళలయందు అన్ని కర్మలయందు పవిత్రమై ప్రశస్తమై యుండగలదు.

**శ్లో॥ లలాటేతిలకం కుర్యా న్మృదావాపి చ భస్మనా ।**
**తదా భావేతు తోయేన చందనే నాపివై ద్విజః ॥**

వస్త్రధారణ గావించిన పిదప నాచరించవలసిన కర్మ తిలకధారణ హిందూ సంప్రదాయములో బొట్టుపెట్టుకొనుట సనాతనముగా సాగుచున్న ఆచారమేగాక ద్విజాదులైనవారి కెల్లరకు విద్యుక్త ధర్మమైయున్నది. గంగాది పుణ్యనదులలో లభించు మట్టిచేగానీ, విభూతిచేగానీ నుదుటను తిలకము



ధరించవలెను. మృదాభస్మము లభ్యములైనప్పుడు చందనాదులతోడనైనను, లేక నిర్మలములగు జలములచేనైనను తిలకము ధరించియే మిగిలిన కర్మల కుపక్రమించవలెను.

**శ్లో॥ ఊర్ధ్వపుండ్రం మృదాకుర్యాత్తిర్య క్పుండ్రం భస్మనా ।**
**చందనే నోభయం కుర్యా దన్యథా నరకం వ్రజేత్ ॥**

**శ్లో॥ త్రిపుండ్రం యతివిప్రాణాం వర్తులం నృపవైశ్యయోః ।**
**అర్ధచంద్రంతు శూద్రాణా మన్యేషా మూర్ధ్వ పుండ్రకమ్ ॥**

మట్టిచేత నిలువుబొట్టును, భస్మముచేత అడ్డబొట్టును, చందనాదులచే నీ రెండు విధములుగాను తిలకము ధరించవలెనెగానీ ఇందుకు వ్యతిరేకముగా చేయరాదు. సన్యాసులు - విప్రులు - ద్విజులు మొదలగువారు భస్మము (విభూది) చే నుదుటియందు మూడు అడ్డరేఖలను ధరించవలెను. క్షత్రియులు, వైశ్యులు చందనాదులచే చంద్రబింబమువలె గుండ్రని తిలకమును ధరించవలెను, శూద్రులు అర్ధచంద్రాకార తిలకమును, మిగిలినవారెల్లరు నిలువురేఖలు గల తిలకమును ధరించుట శ్రేష్ఠము. ఇది స్మృతి విహితముగా దెలుపబడినను దేశాచారవ్యవస్థ ననుసరించి విహితమగు విధముగా తిలకధారణ గావింపవచ్చును. ఏవిధమైన బొట్టును లేకుండా నుండుట మాత్రము దోషప్రదము.

**శ్లో॥ శివాగమేషు నిష్ఠానాం ధార్యం భస్మం త్రిపుండ్రకం ।**
**ఏకమేవ సదాభూత్యా నైవ పుండ్రాంతరం తథా ॥**

**శ్లో॥ ధార్యభస్మ త్రిసంధ్యంతు గృహిణా జలసంయుతం ।**
**సర్వకాలేభవేత్ స్త్రీణాం యతీనాం జలవర్జితమ్ ॥**

శైవదీక్షయే ప్రధానముగా గలట్టి ఆగమనిష్ఠాపరులెల్ల వేళల యందు భస్మముచేత నడ్డరేఖలనే ధరించవలెను. గానీ ఇతర విధములుగా తిలకధారణ మొనర్పకూడదు. గృహస్థాశ్రమ ధర్మమునందుండు వారలు మూడు వేళలయందు భస్మమును జలమిశ్రితము గావించి ధరింపు చుండవలెను. స్త్రీలు, సన్యాసులు మాత్రము ఎప్పుడును జలమిశ్రితము గాని శుద్ధ భస్మముచే ధరింపవలసియున్నది.

## గాయత్రీ మంత్ర జపము

"సంకేత విద్యాగాయత్రీ పరబ్రహ్మ నిరూపణే"
"న చ జీవాత్మ నోభిన్నా గాయత్రీ బ్రహ్మరూపిణీ"

జీవాత్మకంటె వేరుగాని గాయత్రి బ్రహ్మస్వరూపము. ఏది సులభముగా దెలియబడదో ? దేనిని తెలుసుకొనుటవలన జీవన్ముక్తి లభించగలదో ? అట్టి బ్రహ్మవిద్యయే గాయత్రి యని శ్రుతి స్మృతులు దెలుపు చున్నవి. కావున శైవ, వైష్ణవ, శాక్తేయ, సౌర, గాణ పత్యాది భిన్న మతీయులైన వైదికుల లెల్లరకు గాయత్రి అవస్య ఉపాసనీయిని.

"నగాయత్ర్యాః పరంయంత్రం నమాతుం పరదైవతమ్"

అని దెల్పుటచే గాయతిగాక వేరొకమంత్రముగానీ, తల్లిగాక వేరొకదేవతగానీ అధికములుకాజాలవు. సంధ్యాంగముగా బేర్కొనబడినది. ఈ గాయత్రీమంత్రమును గృహస్థ, బ్రహ్మచారి, వానప్రస్థ యత్యాశ్రమముల యందున్న వారెల్లరు ప్రాతఃకాలమునందీ విధముగా గాయత్రీ మంత్రమును జపించవలసియున్నది.

శ్లో॥ బ్రహచార్యాహితాగ్ని శ్చ తమష్టోత్తరం జపేత్ ।
వానప్రస్థో యతిశ్చైవ సహస్రాదధికం జపేత్ ॥

శ్లో॥ పర్వభిస్తు జపేద్దేవీం నమాలాభిః కదాచన ।
సంధ్యాజపంతు గాయత్ర్యాః కుర్యాదంగుళ పర్వభిః ॥
సంధ్యాతిరక్త గాయత్రీం జపేద్వా జపమాలయా ॥

శ్లో॥ అష్టోత్తరశతం న్నిత్య మష్టావింశతి రేవవా ।
విధినాదశకం వాపి త్రికాలేషు జపేద్బుధః ॥

శ్లో॥ గృహస్థో బ్రహ్మచారీ చ ప్రణవాద్యామిమాం జపేత్ ॥

గృహస్థ, బ్రహ్మచారులు ప్రాతఃకాలాది సంధ్యలయందు నూట ఎనిమిది పర్యాయములు గాయత్రీ మంత్రమును జపించవలెను. వాన ప్రస్థులు, యతులు సహస్రాధికముగా జపించవలెను. సంధ్యాంగ గాయత్రీ జపము మాత్రము ప్రత్యేక జపమాలలతో చేయకూడదు. కుడిచేతి వ్రేళ్ళయొక్క



పర్వములచే అనులోమ విలోమములుడగా లెక్కింపుచు సంధ్యాంగా గాయత్రిని జపించదగియున్నది. (అనామికా మధ్యమపర్వము మూల పర్వము, తదుపరి కనిష్ఠికా మూల మధ్యాగ్రపర్వములు, అనామికాగ్రపర్వము, మధ్యమాగ్ర పర్వము, తర్జనీ అగ్రమధ్య మూలపర్వములు వరుసక్రమముగా లెక్కించి తిరిగి తర్జనీమూల పర్వమునుండి పై క్రమంలో అనామికా మధ్యమ పర్వంవరకు లెక్కించవలెను)

నూట ఎనిమిది పర్యాయములు ప్రతిదినము త్రిసంధ్యలయందు జపించుటయుక్తము, లౌకిక వ్యవహారాదులచే ఇబ్బందులు ప్రాప్తించి నప్పుడు ఇరువదెనిమిది పర్యాయములుగానీ కనీసంగా పది పర్యాయములులైనను నిశ్చలమతులై గాయత్రీ మంత్రమును జపించవలెనేగానీ వదలి వేయకూడదు. ఈ మంత్రమును బ్రహ్మచారులు, గృహస్థులు ప్రారంభంలో ప్రణవ వ్యాహృతీత్రయములు జేర్చి జపించవలెనని స్మృతి ప్రమాణములు దెల్పుచున్నవి. ఆశేచద్వయములందు గూడా దీనిని మానరాదని మానసిక ముగా జపింపవలెననియు విధి నిర్ణయముగలదు.

శ్లో॥ సూతకే మృతకే చైవ సంధ్యా కర్మ న సంత్యజేత్ ।
మనసోచ్చారయేన్ మంత్రాన్ ప్రాణాయామమృతే ద్విజః ॥

జాతాశౌచ (పురుడు) మృతాశౌచ (మైల) ములు సంభవించినప్పుడు అర్ఘ్యప్రదానమువరకు మంత్రోచ్చారణ పూర్వకముగా సంధ్యాకర్మను నిర్వర్తించి శేషించిన ఆవాహనా జపోపస్థానాదులను మాత్రము మానసికముగా జరుపవలెను. ఇట్టి సమయములయందు ప్రాణాయామమును జేయకూడదు.

## పవిత్ర ధారణ ప్రాధాన్యత

శ్లో॥ కుశహస్తేన యజ్జప్తం పానం చైవ కుశై స్సహ ।
కుశ హస్తస్తు యోభుక్తే తస్య సంఖ్యాన విద్యతే ॥

శ్లో॥ కుశపూతం భవేత్స్నానం కుశేనోప స్పృశేద్ద్విజః ।
కుశేనచోద్ధృతం తోయం సోమపానేన సమ్మతం ॥

శ్లో॥ జపేహోమే చ దానే చ స్వాధ్యాయే పితృతర్పణే ।
అన్యూనంతు కరంకుర్యా త్సువర్ణ రజితైః కుశైః ॥

కుశలతో జేయబడిన పవిత్రగంధిని ధరించి జేయబడు కర్మలు అనంత ఫలదాయకములుకాగలవు. జపము, దానము, హోమము స్నానము బ్రహ్మయజ్ఞము వేదాధ్యయనము పితృతర్పణము మొదలగు కర్మలన్నియు కుశలు ధరించి ఆచరించుటవలన పరిపూర్ణ ఫలసిద్ధి నందగలవు, కుశోపేతమైన హస్తముతో భుజించుట విశిష్ఠమైయున్నది. కుశలతోకూడిన హస్తముచే త్రాగునీరు అమృతపానము వంటిది. దిజుడైన కర్మిష్ఠుడు కుశలుగానీ, సువర్ణ, రజితాది కుశగ్రంధులుగానీ హస్తమునందు ధరించక నేకర్మయు నొనర్చురాదు.

శ్లో॥ చతుర్భిర్దర్భ పుంజీలై ర్బ్రాహ్మణస్య పవిత్రకం ।
ఏకైక న్యూనముద్దిష్టం వర్ణేవర్ణే యథాక్రమమ్ ।
అనంతర్గర్భిణం సాగ్రం కుశం ద్విదళ మేవచ ।
ప్రాదేశమాత్రం విజ్ఞేయం పవిత్రం యత్రకుత్రచిత్ ॥

గర్భరహితమైనది, అగ్రములతో కూడియున్నది. రెండుదళములు గలదియునగు ప్రాదేశ ప్రమాణము (జానెడుపొడవు) గలట్టి కుశ పవిత్రమునకు యోగ్యముగా దెలుపబడినది. ఇట్టి లక్షణములుగల్గిన నాల్గు కుశలచే బ్రాహ్మణులు మూడు కుశలచే క్షత్రియులు, రెంకుకుశలచే వైశ్యులు, ఒకేఒక్క కుశచేత శూద్రులు అన్ని సత్కర్మలయందు తప్పక పవిత్రమును ధరించవలెను.

శ్లో॥ కుశపాణి స్సదాతిష్ఠే ద్బ్రాహ్మణో దంభవర్జితః ।
సనిత్యం హంతి పాపాని తులారాశి మివానిల ॥



దంభవర్జితులై యెల్లవేళలయందు కుశ పవిత్రమును ధరించియున్న బ్రాహ్మణునియొక్క సర్వపాపములు అగ్ని దూదిని దహించిన విధముగా దహించివేయబడు చుండగలవు. నేటి ఉపాసనా సాంప్రదాయములయందు బహుముఖ విద్యావేత్తలైనవారు సైతము శాస్త్రప్రమాణములను పాటింపకుండుట శోచనీయము. వేదచోదితములను, స్మృత్యుక్తములును అగు సత్కర్మల యన్నిటియందున శాస్త్రవిధులను ధిక్కరించి వర్తించుట ఇహపరసాధ నాటంకమునకు హేతువు కాగలదు.

శ్లో॥ స్థాపయధ్వమిమం ధర్మం ప్రయత్నేనైన భోద్విజాః
స్థాపితే వైదికేధర్మ సకలం సుస్థితం భవేత్ ॥

అని దెల్పుటయేగాక

శ్లో॥ వేదోఽ ఖిలో ధర్మమూలం స్మృతిశీలే చతద్విదాం ।
ఆచారశ్చైవ సాధూనా మాత్మనస్తుష్టిరేవచ ॥

యను మనుస్మృతి వచనముగూడా తనకు-తన హితులకు (యజమానులకు) సంతసముకలిగించి ఇహపర సాధనమున కుపకరించు వేదా విరుద్ధములగు ధర్మములను, ఆచారములను నేటి ఉపాసనకలోకము పాటింపక, నిర్లక్షము గావించుట విచారింపదగిన విషయము.

## ఉపాసనా ప్రశస్తి

శ్లో॥ యథాస్నానం యథాభార్యా వేదస్వాధ్యయనం తథా।
తథై వౌపాసనం దృష్టం నాతిష్ఠేత్తద్వియోగత ః ॥

శ్లో॥ యోదద్యా త్కాం చనం మేరుం పృథివీం చ ససాగరామ్ ।
తత్సాయం ప్రాతర్హోమస్య తుల్యం భవతివా నవా ॥

ప్రతిదినము ప్రాతఃస్నానము, భార్యపోషణము, వేదాధ్యయనము ఏ ప్రకారము వదలివేయుటకు వీలులేనివో ఆ ప్రకారమే ఔపాసన కర్మకూడా వదులుటకు వీలులేదు. బంగారు కొండను దానమిచ్చినను, సప్తసముద్ర సహితముగానున్న ఈ భూమి నంతయు దాన మొసంగినను ఆఫలము నిత్యము జరుపదగిన ఔపాసన కర్మయొక్క ఫలమునకన్నా గొప్పదికాదు.

వలన బ్రహ్మచారులైనవారు అగ్నికార్యమును గృహస్థులైనవారు
సన కుపయుక్తమైన ధారాగ్నిని విడువకూడదని శాస్త్రవచనము.

**అగ్నికార్య పరిభ్రష్టా సంధ్యోపాసన వర్జితా :।**
**వేదం చైవా నధీయానా సర్వేతే వృషలా స్మృతాః ॥**

**కృతదారో నైవతిష్ఠేత్ క్షణ మప్యగ్నినా వినా ।**
**తిష్ఠేతచే ద్విజో వ్రాత్య స్తథా చ పతితో భవేత్ ॥**

బ్రహ్మచారులు అగ్నికార్య - సంధ్యోపాసనలు విడచినా, నిత్యము సన్నిధి యందు వేదాధ్యయనము చేయకున్నను అట్టివారందరు వృషలా నులగుదురు (శూద్రతుల్యులు) గృహస్థాశ్రమవాసులు క్షణ కాలమైనను సనాగ్నిని విడచియుండకూడదు. ధారాగ్నిని పరిత్యజించినవారు త్యులుగను, పతితులుగను శాస్త్రములందు బేర్కొనబడిరి.

## బ్రహ్మ యజ్ఞము

**। వేదమాదౌ సమారభ్య తథోపర్యుపరిక్రమాత్ ।**
**యదధీతేఒన్వహం శక్త్యాతత్ స్వాధ్యాయం ప్రచక్షతే॥**

ప్రతిదినము ద్విజులు వేద - వేదాంగములను పఠించుటయే స్వాధ్యాయమని దెలుపబడినది. అట్టి అధ్యయన కర్మకే బ్రహ్మయజ్ఞమని రు. ఈ బ్రహ్మయజ్ఞమును నిర్వర్తించుటవలన ఏ ఏ కర్మలకు సంబంధించిన మంత్రములు పఠింపబడునో ఆయా కర్మములయొక్క ఫలమును ందువారగుదురు, మరియు ధనపూర్ణమగు భూమిని ముమ్మారు దాన చ్చిన ఫలముగూడా ప్రాప్తింపగలదు.

స్మార్తానుక్రమణికలయందు బ్రహ్మయజ్ఞమును పాఠము శిష్యులకు ంపబడుచున్నది. ఇందు ఋగ్యజు స్సామాథర్వణవేదములయొక్క ప్రారంభ త్రములు మాత్రమే బోధించుటకలదు. ఇదేవిధముగా ఛందో నిరుక్త షాది వేదాంగములు గూడా ప్రారంభస్థితినే అభ్యాసకులకు దెలుపు . ప్రతిదినము యొనర్చు బ్రహ్మయజ్ఞమునందు కూడా తాము నేర్చిన మమునే అనేకులను సరింపుచున్నారు. అది తగినపని. వేదమంత్రము



లతో ప్రారంభించబడిన బ్రహ్మయజ్ఞమునందు తమశక్తికొలది ఆయా వేదములయందలి మంత్ర సన్నములు పఠించవలెను. ఈ దినము సమాప్తి నందిన మంత్రక్రమమును మరుదినము, ఆమరుదినము ఈ విధముగా మొత్తం వేదము నంతయు పూర్తి గావించుటుచితము. ఈ ప్రకారముగానే వేదాంతములను గూడా దినమునకు కొంత చొప్పున ఆసాంతము పూర్తిగావించవలెను.

## వేదముల వివరణ

**1. ఋగ్వేదము :-**

దీనియందు ఐతరేయ బ్రాహ్మణము, శాంఖ్యాయన బ్రాహ్మణములను రెండు బ్రాహ్మణములుగలవు. ఈ వేదము పది మండలములు 1007 సూక్తములు గల్గియున్నది. మరొక విభాగము ననుసరించి 8 అష్టకములు 94 అధ్యాయములు, 2009 వర్గలుగలవు. అశ్వలాయన, శాంఖ్యాయన సూత్రము లీ వేదమునకు సంబంధించినవై యున్నవి.

**2. యజుర్వేదము :-**

ఈవేదము 1) కృష్ణయజుర్వేదము 2) శుక్లయజుర్వేదమను భేదములతో ద్విధాత్వమునందియున్నది.

**౧) కృష్ణయజుర్వేదము :-** దీనికి తైత్తిరీయ శాఖయను నామాంతరముగలదు. ఈ వేదము సంహిత, బ్రాహ్మణము, అరణ్యకము అని మూడు విధములుగా విభజింపబడియున్నది. ఇందులో సంహిత యందు 44 ప్రశ్నలు, బ్రాహ్మణమునందు 28 ప్రశ్నలు, అరణ్యకమునందు 10 ప్రశ్నలు కలిగి మొత్తం 82 ప్రశ్నలు (పన్నములు)గా నలరారుచున్నది. ఆపస్తంబ, బోధాయన, సత్యాషాఢ, హిరణ్యకేశీయ, భారద్వాజ, వైఖానస కల్పసూత్రములు లీ వేద సంబంధములై యున్నవి.

**౨) శుక్లయజుర్వేదము :-** దీనియందు మాధ్యందినశాఖ - కణ్వ శాఖలను రెండు శాఖలుగలవు. ఇందలి మాధ్యందినశాఖకే వాజసనేయ సంహిత యను బేరుగలదు. ఈ వేదమునందు 40 అధ్యాయములుగలవు.

దీనికి "శతపథబ్రాహ్మణ" మనుపేరున నొక బ్రాహ్మణముగూడా నున్నది. పారస్కర, కాత్యాయనాది కల్పసూత్రములు లీ వేదమునకు సంబంధించినవై యున్నవి.

**3. సామవేదము :-**

ఈ వేదము పూర్వార్చికము, ఉత్తరార్చికమని రెండువిధములుగా విభజించబడియున్నది. పూర్వార్చికమునందారు ప్రపాఠకములు, ఉత్తరార్చికమునందు 9 ప్రపాఠకములును గలవు. ఇందు తాండ్య బ్రాహ్మణ, షడ్వింశబ్రాహ్మణ, సామవిధానబ్రాహ్మణ, వంశబ్రాహ్మణ, ఆర్షేయ బ్రాహ్మణ, దేవతాధ్యాయబ్రాహ్మణ, సంహితోపనషద్బ్రాహ్మణములను అష్టబ్రాహ్మణములు గలవు. గోభిల, లాట్యాయన, ద్రాహ్యాయణాది సూత్రము లీ వేదమునకు సంబంధించినవై యున్నవి.

**4. అధర్వవేదము :-**

ఈ వేదము ఇరువది కాండములుగల్గి, ప్రతి కాండయందున కొన్ని అనువాకములతో విభజింపబడియున్నది. ఇందు "గోపథబ్రాహ్మణ" మను బ్రాహ్మణముగలదు. కౌశిక కల్పసూత్ర మీ వేదమునకు సంబంధించినది.

## వేదాంగములు

1. శిక్ష 2. వ్యాకరణము 3. ఛందస్సు 4. నిరుక్తము 5. జ్యోతిషము 6. కల్పము అని వేదమునకు షడంగములు తెలుపబడినవి.

**1. శిక్ష :-**

ప్రతి వేదమునకు ఒక్కొక్కటిగా శిక్షలు నాలుగుగలవు. అందు శౌనకశిక్ష, భారద్వాజ శిక్షాదికములున్నవి ఇది పాణి న్యాచార్య విరచితము.

**2. వ్యాకరణము :-**

దీనికే మహాభాష్యమని కూడా పేరుగలదు. ఇది 8 అధ్యాయములు కలిగి ప్రతి అధ్యాయము నాల్గు పాదములుగా విభజింపబడియున్నది. దీనికి



పతంజలి మహర్షి భాష్యమును, కాత్యాయనుడు వార్తికములు సమకూర్చి యున్నారు. వ్యాకరణముకూడా పాణిన్యాచార్య ప్రోక్తమైయున్నది.

**3. ఛందస్సు :-**

పదునెన్మిది విభాగములుగా విభజింపబడిన ఛందశ్శాస్త్రము పింగళాచార్య కృతమైయున్నది.

**4. నిరుక్తము :-**

ఇందు పూర్వషట్కము, ఉత్తర షట్కములను విభాగములందు పదిరెండధ్యాయములు గలవు. పరిశిష్టముగా మరి రెండధ్యాయములున్నవి. ఇది వేదపద నిర్వచనశాస్త్రము (వైదికనిఘంటువు) దేవరాజ యజ్వాదులు దీనికి వ్యాఖ్యానములు చేసియున్నారు. ఇది యాస్కుని ప్రణీతము.

**5. జ్యోతిషము :-**

వేదాంగ జ్యోతిశాస్త్రములు ప్రతివేదమునకు వేర్వేరుగ నున్నవి. ఏడు ప్రకరణములుగల ఈ శాస్త్రమునకు కర్త లగధుడు.

**6. కల్పము :-**

కల్పసూత్రములను పేర ఆయా వేదములకు ప్రత్యేకముగా కల్పములున్నవి. సూత్రములలో ముఖ్యమైనవాటిని పూర్వమే పేర్కొనుట జరిగినది.

**శ్లో॥ అనుగంతుం నతాం వర్త్మకృత్స్నం యది నశక్యతే ।**
**స్వల్ప మప్యనుగంతవ్యం మార్గస్థో నావసీదతి ॥**

వేదవేదాంగములను పూర్తిగా అధ్యయనముగా వించుటకు శక్తి లేకున్నను వీలైనంతవరకైనను అభ్యసించుట యుచితము. విద్యయందు శ్రద్ధ-ఆసక్తికలిగి ఆ మార్గమందేయున్నను ఫలసిద్ధినందుట కవకాశము లుండగలవు. ద్విజులకు వేదములు - వేదాంగములు వాటిస్వరూపములు దెలియ తలంపుతోడనే ఈవేద - వేదాంగ వివారణము సంక్షిప్తముగా దెలుపబడినది.

## దేవతార్చన

శ్లో॥ శైవం చ వైష్ణవం శాక్తం సౌరం వైనాయకం తథా ।
స్కాందం చ భక్తి మాశ్రిత్య పూజితాని షడేవహి ॥

శైవ, వైష్ణవ, శాక్త, శౌర, గాణపత్య, స్కాంద సాంప్రదాయములతోనే సాంప్రదాయమునందైనను భక్తియే ముఖ్యముగా వారి ఇష్టదైవమును పూజింపవచ్చును. "దేవతానాం చ పూజనం" యని చెప్పి యుండుట వలన ద్విజులు వ్యష్టి పూజకన్నను సమిష్టిపూజ నొనర్చుటే శాస్త్రవిహితము. దేవతలను ప్రత్యేక నామములతో నిర్ణీతఫలసిద్ధికై ప్రత్యేకముగా పూజించుట వ్యష్టిపూజ యనబడును. ఒకే దేవతయందు సర్వదేవతాభావముగల్గి నిరపేక్షతో నర్చించునది సమిష్టిపూజగా 'దెలుపబడినది. మీమాంసశాస్త్రము కూడా దేవతల నందరినీ ఒకే దేవతగా నుపాసింపవలెనని దెల్పుచున్నది.

శ్లో॥ సన్నియమ్యేంద్రియ గ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూతహితే రతాః ॥

ఈ గీతావాక్యముతోబాటుగా "ప్రాజ్ఞం వా ఇదగ్ం సర్వం" యను శ్రుతివాక్యముగూడా సమిష్టిపూజకే ప్రాధాన్య మొసంగుచున్నది. ఆదిశంకరులు కూడా తన శంకర విజయమునందు సమిష్టిపూజనే సమర్థించుట జరిగినది. ముముక్షువులకిది (సమిష్టిపూజ) అవశ్యకర్తవ్యము. శైవ, వైష్ణవాది మత భేదములను రూపుమాపి భగవతత్త్వమున కేకత్వము గల్పించుటకే "పంచాయతన" పద్ధతి వ్యవస్థాపించబడినది. శివుడు, విష్ణువు, సూర్యుడు, గణపతి, శక్తి యనువారు సంచాయతన దేవతలు వీరిని ఐదుగురినీ ఒకేమారు అర్చించు విధానమే దేవతార్చనము.

శ్లో॥ గగనం శివం ప్రోక్తం అంబికం వాయుమేవచ ।
ఆదిత్య మగ్ని తత్త్వం చ కేశనం జలసంజ్ఞికమ్ ॥
గణేశం పృథివీ ప్రోక్తం పంచాయతన మీదృశం ।
మధ్యే మరుదగ్న్యీశాన నైఋతీం చ యథాక్రమమ్॥

శివుడు ఆకాశతత్వముగాను, శక్తివాయుతత్వముగాను, సూర్యుడగ్ని తత్వముగాను, విష్ణువు జలతత్వముగాను, గణపతి పృథివీతత్వముగాను



దెలుపబడియున్నారు. వీరిని పై వరుసక్రమంలో అనగా వేదమధ్యభాగంలో శివుని వాయువ్యంలో శక్తిని, ఆగ్నేయంలో సూర్యుని, ఈశాన్యంలో విష్ణువుని-నైఋతియందు గణపతిని స్థాపించి దేవతార్చన చేయవలసి యున్నది; శివుడు నామరూప వికారరహితుడు గావున లింగముగా శివుని, సాలగ్రామముగా విష్ణువును, స్ఫటికశిలగా సూర్యుని శోణానదీ సముద్భవ మగు సింధూర వర్ణశిలను గణపతిగాను, శ్రీచక్రమును శక్తిను భావించుట సమంజసము.

శ్లో॥ శంభౌమధ్యగతే హరీన హరభూదేవ్యో, హరౌశఙ్కరే ।
భాన్యేనాగసుతా, రవౌ హరిగణేశా జాబ్బికాస్థాపయేత్ ।
దేవ్యాం విష్ణుహరేభవక్త్రరవయో, లమ్బోదరేఽ జేశ్వరా ।
నార్యా, శఙ్కరదిఙ్ముఖాస్తు ఫలదా వ్యస్తాస్తుతే హానిదాః ॥

శైవులు మధ్యలో శివలింగము నిలిపి పూర్వము పేర్కొనిన క్రమంలో వాయువాగ్నే యేశాన్య నైఋతి భాగములందు వరుసగా శక్తి సూర్య, విష్ణు, గణేషులనుంచి సమిష్టి పూజను శివపరంగా చేయవలసి వుంటుంది. ఇది శివ పంచాయతనము.

వైష్ణవులు పంచాయతన పీఠమధ్యభాగమునందు విష్ణువుని స్థాపించి వాయవ్యమునందు శక్తిని, ఈశాన్యమునందు శివుని, ఆగ్నేయమునందు గణపతిని, నైఋతియందు సూర్యుని నెలకొల్పి నారాయణ పరముగా సమిష్టిపూజ నొనర్పదగియున్నది. ఇది విష్ణుపంచాయతనము.

శాక్తేయులు మధ్యభాగంలో శ్రీచక్రమును నెలకొల్పి దానికి వాయువ్యమునందు సూర్యుని, ఈశాన్యమునందు విష్ణువును, ఆగ్నేయము నందు శివుని, నైఋతియందు గణపతినియుంచి శ్రీవిద్యాపరముగా సమిష్టి పూజ నొనర్పవలెను. ఇది శక్తి పంచాయతనము.

సౌరులు మధ్యభాగమునందు సూర్యుని నెలకొల్పి, వాయువ్యమందు శక్తిని ఈశాన్యమునందు విష్ణువును, ఆగ్నేయమునందు గణపతిని, నైఋతియందు శివుని ప్రతిష్ఠించి సూర్యపరముగా సమిష్టిపూజ గావింపవలెను. ఇది సౌరపంచాయతనము.

గాణాపత్యులు మధ్యభాగంలో గణపతిని ప్రతిష్ఠించి, వాయువ్యంలో శక్తిని, ఈశాన్యంలో విష్ణువును, ఆగ్నేయమునందు శివుని, నైఋతియందు సూర్యుని నెలకొల్పి గణపతిపరముగా సమిష్టిపూజ నొనర్చుట యుక్తము. ఇది గణేశపంచాయతనము.

సాంప్రదాయ భిన్నముగాని విధముగా శైవ, వైష్ణవ, శాక్తసౌర, గాణపత్య మతములవారు వారి వారికి దగిన విధముగా పంచాయతన దేవతలను నెలకొల్పి వారి ప్రధాన దైవమునందే సర్వదేవతలను భావనజేసి ఏకకాలమునందు సమిష్టిపూజ నొనర్చుట స్మృతికి విహితము. దీనినే దేవతార్చనగా దెలియవలెను.

## వైశ్వదేవము

వైశ్వదేవకర్మ వైదిక సంప్రదాయానుగతమైనది. సామూహిక క్రియాకలాపము నంతయు పరిశీలించిన యెడల మానవుడు అందున ద్విజుడైనవాడు తన ఉనికికి మూలకారణములైన దేవతలకు, పంచభూతములకు, హీనజాతములైన ఇతర జీవరాశికి తాను భుజించుటకు ముందుగా బలుల నిచ్చుటయే యని దెలియగలదు. వండిన పదార్థములలో ముఖ్యములైన అన్న సూపాదులను కొంతభాగము గ్రహించి దానిని ఐదుభాగములొనర్చి ప్రథమముగా అగ్నియందు తదుపరి భూమియందు విద్యుక్త విధానముగా నిత్యము బలుల నొసంగు కర్మయే వైశ్వదేవకర్మ.

## అతిథి పూజ

శ్లో॥ కృత్వైత ద్బలి కర్మైవ మతిథిం పూర్వమాశయేత్ ।
భిక్షాం చ భిక్ష వేదద్యా ద్విధివ ద్బ్రహ్మచారిణే ॥

శ్లో॥ తతో గోదాహమాత్రం వా కాలం తిష్ఠేద్గృహాఙ్గణే ।
అతిథి గ్రహణార్థాయ తదూర్ధ్వం వా యధేచ్ఛయా ॥
నాడికాయా చతుర్భాగం గోదాహం బ్రువతేబుధాః ॥



వైశ్వదేవాది బలికర్మలు నిర్వర్తించిన పిమ్మట యతులు, భిక్షుకులు బ్రహ్మచారులకు భిక్షనొసంగి అతిథులకొరకై తన గృహద్వారమునందు గృహస్థుడు ఎదురు చూడవలెనని ధర్మవచనము. ఈ ప్రకారముగా అతిథులకొరకై గృహస్థు ప్రతిదినము తన వాకిలియందు గడియలో నాల్గువవంతు కాలమువరకు (6 నిమిషాలు) నిరీక్షించిన పిమ్మట అతిథులు లభించనియెడల తాను భోజనము చేయవలెను.

శ్లో॥ ఏకరాత్రంతు నివ సన్నతిథి ర్బ్రాహ్మణ స్మృతః ।
అనిత్యం హి స్థితో యస్మాత్తస్మా దతిథి రుచ్యతే ॥

ఇతరుల గృహమునందు దొకదినము మాత్రమే నివశించు బ్రాహ్మణుడు తిథియని జెప్పబడినది. నిలచుట యనిత్యము గావున ( ఏ దినమెచ్చటనో తెలియక సంచరించెడువాడు) అట్టివానిని అతిథిగా శాస్త్రములు దెల్పుచున్నవి.

శ్లో॥ నైక గ్రామీణ మతిథిం విప్రం సాంశతికం తథా ।
ఉపస్థితం గృహే విద్యా ద్భార్యాయత్రాగ్న యో ఽ పివా ॥

బ్రాహ్మణుడైనను తన గ్రామమునందే నివశించువాడు, పరిహాసాది వివిధ వ్యవహారముల నొనర్చుచు అదియే వృత్తిగా కుటుంబపోషణము గావించుకొనువాడు, కుటుంబము లేక దేశసంచారము జేయుచు జీవించువాడు వైశ్వదేవాంతమున వచ్చినను వారు అతిథులుగానేరరు. కావున వారికి తనతోబాటుగానే భోజనము పెట్టవచ్చును. (అనగా అతిథిపూజకు ముందుగా భుజింపజేయుటకు నట్టివార నర్హులు)

శ్లో॥ సంప్రాప్తాయ త్వతిథయే ప్రదద్యా దాసనోదకే ।
అన్నం చైవ యధాశక్తి సత్కృత్య విధి విధి పూర్వకమ్ ॥

యోగ్యుడైన యతిథి లభించుట పూర్వపుణ్యవశమునగానీ కలుగ నేరదు. అట్టి వేదవిదుడైన యతిథి సంప్రాప్తించినతోడనే పాదప్రక్షాళనము గావించి స్వాగతముజెప్పి, అర్ఘ్యపాద్యము లొసంగి, అనుపానములతో గూడిన భోజనమును బెట్టవలెను. తదుపరి అతిథి శయనించుటకు విశ్రాంతిస్థాన మేర్పరచి శయ్యాదులు సమకూర్చిన పిదపతాను భుజించవలెను.

వేదాధ్యయన రహితుడగు బ్రాహ్మణు డతిథిగావచ్చిన యెడల ఆసన్నాన సత్కారములు జరుపవలెగానీ ప్రత్యుత్థాన మొనర్పబనిలేదు. నమస్కారమున కర్హుడైన యెడల నమస్కార మొనర్చుట చెప్పబడినది. క్షత్రియ,వైశ్యులు అధ్యయన పరులైనప్పటికీ వారికి ప్రత్యుత్థాన నమస్కారము లవసరములేదు. కేవల ఆసనాన్నపానాదుల నొసంగినచాలును. శూద్రు డతిథిగా జనుదెంచిన యెడల స్వల్పమైన ఒక రార్యమునుజెప్పి అది చేసిన పిదప భోజనాదుల నొసంగవలెను. అతిథి పూజానంతరము గోవున కాహారమొసంగి భుజించుట విశేష ఫలప్రదముగా దెలుపబడినది.

శ్లో॥ గవాహ్నికం పరగవే దద్యాదపి తృణాదికమ్ ।
అకృత్వా స్వయ మాహారం స్వర్గలోకం సగచ్ఛతి ॥

అతిథి పూజానంతరము తాను భుజించుటకు ముందుగా వరుని యావునకు గడ్డి లేక ఇతర ఆహారమును నిత్యము నొసంగువారు స్వర్గము నందగలడని వ్యాసవచనము.

## సాలగ్రామ తీర్థ ప్రాశన

శ్లో॥ చతుర్గుణీ కృతవస్త్రే పాణినిధాయ తేనదే ।
శఙ్ఖతీర్థం శిరసిధారయేత్ ॥

పంచాయతన దేవతార్చనానంతరము తీర్థప్రాశనకు ముందుగా స్థిరచిత్తుడై కూర్చుని నాల్గు మడతలుబెట్టిన వస్త్రముపై కుడిచేతినిబెట్టి శంఖతీర్థమును గ్రహించి శిరముపై చల్లుకొనవలెను. ఈ శంఖతీర్థమును శిరమును దాకినయెడల పదివేల బ్రహ్మహత్యా పాతకములనైనను పరిహరించగలదు.

శ్లో॥ వస్త్రం చ తుర్గుణీ కృత్య పాణౌపాణిం నిధాయ చ ।
పవిత్రం విష్ణు పాదామ్బుభిః పిబేద్బిందు వర్జితం ।
సాలగ్రామ శిలాతీర్థం హస్తేనైవ పిబే త్సుధీః ॥

పూర్వమువలె నాల్గు మడతలు బెట్టిన వస్త్రమును ఎడమచేతి యందుంచుకొని, దానిపై కుడిహస్తముంచి సాలగ్రామ తీర్థమును



బ్రహ్మతీర్థముద్వారా మూడుపర్యాయములు లోపలికి పుచ్చుకొనవలెను. ఈ తీర్థమును తన హస్తమునందలి బ్రహ్మతీర్థ స్థానముద్వారానే పుచ్చుకోనవలసి యున్నది. తీర్థప్రాసన సమయమునందు ఆ తీర్థ బిందువులు క్రింద 1పడకూడదు.

శ్లో॥ విష్ణోః పాదోదకం పీతం కోటిహత్యా ఘనాశనం ।
తదౌవాష్టగుణం పాపం భూమౌ బిన్దు నిపాతనే ॥

శ్రీ విష్ణుని పాదతీర్థము స్వీకరించుటవలన కోటి హత్యలవల్ల కలుగు నంతటి పాపమైనను తక్షణమే పరిహరింపబడగలదు. అట్టి పవిత్ర తీర్థమునందలి ఏ కొలది బిందువైనను భూమియందు బడినయెడల అష్టకోటి హత్యాపాపములు సంక్రమించగలవు. కావున విష్ణు పాదోదకమును క్రిందజారకుండా శ్రద్ధగా స్వీకరించవలెను.

శ్లో॥ సాలగ్రామ శిలాతీర్థ మపీత్వా యస్తుమస్తకే ।
ప్రక్షేపణం ప్రకుర్వీత బ్రహ్మహా న నిగద్యతే ॥

శ్రీహరియొక్క పాదతీర్థములను పానముజేయనివారు, ఆ తీర్థమును శిరస్సుపై జల్లుకొనెడివారు బ్రహ్మహత్యాపాపమును పొందగలరు.

శ్లో॥ హరిపాదోదకే నోక్తం గ్రాహయే త్సర్వదేవతాః ।
శిరస్యప్రోక్తయే తీర్థం శైవానాం మంగళప్రదమ్ ॥

సాలగ్రామతీర్థ ప్రాశనకు జెప్పబడిన నియమములే సర్వదేవతల యొక్క తీర్థములు స్వీకరించుట కుపయుక్తమైయున్నది. శివునియొక్క అభిషేకజలములను శైవులు శిరముపై జల్లుకొనుటవలన మంగళప్రదము కాగలదు.

# ఉపాసనా విధులు

## సాంప్రదాయము

ఇంతకుబూర్వము ద్విజులకు నిత్యానుష్టేయములై, శ్రుతి స్మృతి ప్రతిపాదితములైన స్నాన, సంధ్యా, హోమ, జప, దేవతార్చన, వైశ్వదేవ, అతిధి పూజలను షట్కర్మలను గురించి వివరించబడినది.

**శ్లో॥ శ్రుతి స్మృతిర్మమై వాజ్ఞా యస్తాముల్లంఘ్య వర్తతే ।**
**ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ మద్భక్తోపి న వైదికః ॥ (వైష్ణవః)**

శ్రుతి-స్మృతులు రెండును భగవదాజ్ఞతో నెలకొల్పబడినవే ! అట్టి వాటిని ఉల్లంఘించుట అనగా వాటిని పాటింపనివాడు భగవద్భక్తుడే అయినను భగవద్రోహి యగుటయేగాక వైదికుడుకూడా కానేరడు. కాబట్టి విప్రులు శ్రుతి-స్మృతి విహితములైన కర్మలు నిర్వర్తించి, సదాచారపరులై ఇహపర సాధనాత్మకమగు ఉపాసనా విధానమునందు బ్రవేశింపవలసి యున్నది.

**శ్లో॥ యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కర్మకారతః ।**
**నససిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥**

అని భగవానుడే స్వయముగా దెల్పుటవలన శాస్త్రవిధులను, ధిక్కరించి ఆచరించు ఏకార్య (కర్మ) మైనను సిద్ధింపనేరదు. ఇహఫలముగానీ, పరగతినిగానీ పొందుట దుర్లభము. కావున వైదికసాంప్రదాయ బద్ధమైన ఉపాసనాక్రమమే సాధకులకు భయతారకము కాగలదు. శ్రుతులుపదేశించిన జ్యోతిష్టోమాదికర్మలు, శ్రీవిద్యాది ఉపాసనలు, జ్ఞానసిద్ధికి సోపానములు కాగలవు. ముఖ్యముగా ఉపాసనవలన అంతఃకరణ శుద్ధి చేకూరి జ్ఞానికాగలడు.

ఉపాసనాక్రమంలో విభిన్న సంప్రదాయములు నెలకొనియున్నవి. వీనిలో 1. సమయారా సంప్రదాయము. 2. దక్షిణాచార సంప్రదాయము 3. కౌళాచార సంప్రదాయము. 4. వామాచార సంప్రదాయము అనునవి విస్తృతముగా వ్యాపింపబడియున్నవి. ఈ నాలుగు సంప్రదాయములందు



మొదటి రెండు సంప్రదాయములగు సమయ, దక్షిణ సంప్రదాయములు మాత్రమే వైదికుల కాచరణ యోగ్యములుగా దెలుపబడినవి. స్నానసంధ్యాది విధానముల నవలంబించు శ్రుతి-స్మృత్యుక్తముగా ఫలపుష్ప జలాదులచే శ్రీచక్రము-లింగ-సాలగ్రామ- ఘట (కలశ) యంత్రములకు అర్చనాదులను నిర్వర్తించి గురూపదిష్టమైన మహా మంత్రములను చిత్తైకాగ్రతతో జపించుట ఉపాసన సమయ సంప్రదాయము, శ్రుతి స్మృతులచే దెలుపబడిన స్నానసంధ్యాదులు-గాయత్రీ పంచాక్షరీ, షోడశీ, నారాయణ అష్టక్షర్యాది మహావిద్యా మంత్రములు జపించు ఉపాసన దక్షిణాచారము, ఇందు కర్మాచరణమునకున్న ప్రాధాన్యత బాహ్య పూజాదులకు గానుపించదు.

కౌళ - వామాచారములు రెండును వైదిక సిద్ధాన్తములకు వ్యతిరిక్తమైనవి. ఇందు నరదంతమాలలు, కపాలములు, మధుమాంస, మైధునాది క్రియలు కల్గి వేదమార్గమునకు విరుద్ధములై యున్నవి.

**శ్లో॥ ఏగతావేద బాహ్యత్వం యేచ సంకీర్ణ జాతయః ।**
**తే ఉ ధి క్రియంతే తంత్రాదౌ స్త్రీ శూద్రాశ్చయధా తథా ॥**

వేదబాహ్యులు, సంకీర్ణ జాతులకు సంబంధించినవారు మాత్రమే తంత్రోక్తమములైన కౌల-నామాచార సాంప్రదాయముల ననుసరింపవలెనని సర్మార్గవర్తకులు, నిష్ఠాగరిష్ఠులగు విప్రులకీ సాంప్రదాయము తగదనియు తెలియవలెను. **"వామః ప్రసిద్ధః సర్వత్ర దక్షిణః వ్యాపినేక్ష్యతే"** అను ప్రమాణమును ననుసరించి లోకమునందు విస్తృతముగా వ్యవహరింపబడుచు ప్రసిద్ధమై యుండినంత మాత్రమున వామ సాంప్రదాయము వేద సాంప్రదాయ మెన్నటికినీ కాజాలదు.

## ఉపాసనకు గురు ప్రాధాన్యత

శ్లో॥ ఆచార్యః ప్లావితా తస్య జ్ఞానం ప్లవ ఇ హోచ్యతే ॥
గుకారశ్చ గుణాతీతో రుకారోరూప వర్జితః ।
గుణాతీతి మరూపం చ యత్తత్వం న గురుః స్మృతః ॥
"గృణాతి ఉపదిశతి ధర్మమితి గురుః"

అజ్ఞానమనే మహాసాగరమునందు జ్ఞానమనబడే నావపై మనుష్యులను ముముక్షుస్థానమునకు నావికుడై జేరవేయగల సమర్థుడు గురువని దెలుపబడినది. నిరాకారమును, గుణాతీతమునగు తత్త్వమేదిగలదో అదియే గురువనబడుచున్నది. గుకారము గుణాతీతమును సూచింపుచుండగా, రుకారము రూపరహితమును దెల్పునదై యున్నది. శిష్యునికి ఏదిధర్మమో ? ఏది ¯యధర్మమో వివరించి సన్మార్గావలంబకుని జేయువాడే గురువు. గావున, గురువు వలననే ఉపాసనను, ఉపాసనా విధులను గైకొనవలెనని శాస్త్రములు దెల్పుచున్నవి. "ఆచార్యదేవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపత్" అని ఆచార్యునివలన నేర్చిన విద్యయే సాధుత్వముగల్గి శీఘ్ర ఫలప్రదము కాగల్గదు.

శ్లో॥ చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం య త్స్మరేత్ ।
హస్తసముదకం త్యక్త్వా ఘనస్థ మభివాః చతి ॥

తనకంటి కెదురుగా కనుపించు గురువునువదలి శాస్త్రముల నెవడాశ్రయించునో అట్టివాడు చేతియందున్న జలములను వదలి నీటి కొరకై మేఘములరాక కెదురుజూచు విధముగా నుండగలదు.

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదమ్ ।
మంత్రమూలం గురోర్వాక్యం సిద్ధిమూలం గురోకృపా
గురుమూలాః క్రియాస్సర్వా లోకేస్మిన్ కులనాయికే ।
తస్మాత్సేవ్యం గురుర్నిత్యం సిద్ధ్యర్థం భక్తి సంయుతైః ॥

గురు వాక్యములు మాత్రమే మంత్రములు, ఆ గురువుయొక్క అనుగ్రహమే మంత్రసిద్ధి. గురు విగ్రహభావమే ధ్యానము. గురుని పదకమలములేపూజ. ఈ లోకమునందేవిద్య సిద్ధించవలెనన్నను గురువే గురు చరణముల నాశ్రయించి సేవించి ఉపాసనా రహస్యములను దెలిసి జ్ఞానులు గావలెను.



శ్లో॥ బ్రహ్మావిష్ణు మహేశా ద్యా దేవతాముని యోగినః ।
కర్వం త్యను గ్రహం తుష్టా గురౌతుష్టౌ న సంశయః ॥

శ్లో॥ గురుభక్తి విహీనస్య తపోవిద్య వ్రతం కులం ।
నిష్ఫలంతే కులేశానీ! కేవలం లోకరంజనమ్ ॥

గురువు శిష్యుని యనుగ్రహించి ఆ శిష్యునియెడల సంతుష్టుడైయుండిన బ్రహ్మ విష్ణు మహేశ్వరాది సకల దేవతలు, ఋషులు, యోగులు కూడా సంతుష్టినంది అనుగ్రహప్రదులై యుండగలరు. గురుభక్తి–గురుని యందు విశ్వాసము లేనివారికి ఎంత విద్యాతపస్సులున్నను, వ్రతదీక్షలు, ఉత్తమకుల సంస్కారములున్నను అవియెల్ల ఉపాసనాపరంగా నిష్ఫలములే యగుచున్నవి. అట్టి ఉపాసకుడు, లోకరంజనజేయు డాంబికుడు మాత్రమే ! కావున ఉపాసకులకు యోగ్యుడైన గురువు చాలా అవసరము.

## గురువున కుండవలసిన అర్హతలు

శ్లో॥ శాంతో దాంతః కులీనశ్చ వినీతః శుద్ధ వేషవాన్ ।
సదాచారః సుప్రసిద్ధః శుచిర్దక్షః సుబుద్ధిమాన్ ॥
ఆశ్రమీ ధ్యాననిష్ఠశ్చ మంత్రతంత్ర విచక్షణః ।
నిగ్రహోధుగ్రహే శక్తో గురు రిత్యభిధీయతే ॥

బాహ్యేంద్రియ–అంతరేంద్రియ నిగ్రహములు గల్గి శాంతుడైనవాడు, ఉత్తమకులమునందు బుట్టినవాడు (బ్రాహ్మణుడు) అణుకువగల్గి పరిశుభ్రముగా నుండువాడు. వైదిక వేషభాషలతో నుండువాడు, శాస్త్రీయాచారవర్తనుడు ప్రసిద్ధ వహించినవాడు, సదా పవిత్రముగా నుండువాడు, బుద్ధిమంతుడు అన్ని విషయములందు సమర్థుడు, బ్రహ్మచర్య, గృహస్థ, సన్యాసములను చతుర్విధాశ్రమములతో నొకదాని నాశ్రయించియున్న వాడు, ధ్యాననిష్ఠుడు, మంత్ర–తంత్రముల లోతును, రహస్యార్థములును

బాగుగా దెలిసినవాడు, నిగ్రహానుగ్రహ సమర్థతగలవాడు గురువని దెలుపబడుటచే ఇట్టి లక్షణములున్నవారే గురుస్థానమున నుండుట కర్హులు.

## గురుత్వమున కర్హతలేనివారు

శ్లో॥ క్రోధీ కుష్ఠీ మహారోగీ మలినో నిర్ఘృణో జడః ।
అపండితో నిందకశ్చలోలుపోవిషయాతురః ॥
దాంభికో గర్వసంయుక్తః పాపాత్మాదుష్ట వంశజః ।
ఘాతీ పరద్రోహకర్తా పరద్రవ్యాపహారకః ॥
అజితాత్మా వేదబాహ్యః పరదార రతస్సదా ।
పరదోషారోపకశ్చ కృపణశ్చా జితేంద్రియః ॥
వేదవేద ద్విజానం చ యతితీర్థ గవామపి ।
తులసీ వహ్ని సూర్యాణాం ద్వేష్టా యోగ్యో గురుర్నహి ॥

క్రోధము (కోపము) కుష్ఠక్షయాది మహారోగములు, మలినము, నిర్ధయ, మూర్ఖము గలిగియున్నవాడు, పాండిత్య వర్జితుడు. దూషించు స్వభావము, విషయలోలత్వము, కామాసక్తి, దంభము, గర్వము, పాపబుద్ధి కలిగియున్నవాడు దుష్టవంశసంజాతుడు, హింస, వంచన, మోసము, పరద్రవ్యాపహర బుద్ధికలిగినవాడు ఇంద్రియ నిగ్రహము లేనివాడు, వేద ధర్మములను పాటించనివాడు, ఇతరుల దోషముల నెంచువాడు, లోభి,వేదశాస్త్రములను, బ్రాహ్మణులను, యతులను, గో, తీర్థ తులసీవృక్షములను, అగ్ని సూర్యులను ద్వేషించువాడు, గురువుగానుండుటకు తగనివారు. ఇట్టివారిని గురువుగా నెంచుకొనుట శాస్త్ర విరుద్ధము.



## గురువునకు వర్ణాశ్రమ తారతమ్యము

శ్లో॥ ఉత్తమో బ్రాహ్మణః ప్రోక్తో మధ్యమోక్షత్రియ స్తథా ।
అధమో వైశ్య ఇత్యుక్త స్సర్వశాస్త్రార్థ వేదిభిః ॥

వర్ణాశ్రమముల ననుసరించి బ్రాహ్మణ వర్గీయులు గురువుగా నుండుటకు ఉత్తముడు, క్షత్రియ వర్గీయుడు మధ్యముడ, వైశ్యుడు అధముడు, "శూద్రాణాం చ తథా స్త్రీణాం గురుత్వం న కదాచన" యని సూతసంహితయందు దెల్పుటచే శూద్రులకు, స్త్రీలకు గురుత్వాధికారములేదు. వైశ్యుడు వైశ్యశూద్రులకు, క్షత్రియుడు వైశ్య శూద్రులకు, బ్రాహ్మణుడు బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులకు గురువుగా నుండవచ్చును. (ఉండరాదని వేరొకమతము) బ్రాహ్మణుడు శూద్రుల కుపదేశముల నొసంగుట నిషేధము.

శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థస్య షసస్థస్య యతేరపి ।
విద్యోత్కర్ష బలేనైన గురుర్భవతి నాన్యథా ॥

శ్లో॥ గృహస్థో ఽపి వనస్థస్య యతే రప్యంబుజేక్షణ ।
విద్యోత్కర్ష బలేనైవ గురుర్భవతి నాన్యథా ॥

శ్లో॥ వానప్రస్థాశ్రమ స్థోఽపి తథా సన్యాసినాం హరే ।
విద్యోత్కర్ష బలేనైన గురుర్భవతి నాన్యథా ॥

శ్లో॥ అతివర్ణాశ్ర మీప్రోక్తో గురు స్సర్వాధి కారిణామ్ ॥

విద్యా వివేక జ్ఞానములం దదికుడైనను బ్రహ్మచారి గృహస్థ, వానప్రస్థ సన్యాసులకు గురువుగా నుండుట ర్హుడుకాగలడు. అదేవిధముగా గృహస్థాశ్రమ వానప్రస్థ-సన్యాసులకును, వానప్రస్థుడు, సన్యాసికిని, గురువుగా నుండవచ్చును. అతివర్ణాశ్రమి యగు నతడు మాత్రము బ్రహ్మచారులకు గృహస్థ, వానప్రస్థ, సన్యాసాదుల కందరికిని గురువుగా నుండుట కర్హతకలిగియున్నాడు.

తన శరీరేంద్రియములకు భిన్నుడై, పరమార్థైకవిజ్ఞాన స్వయం ప్రకాశకుడై, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలనుండి విడివడి భౌతిక వాసనా రహితుడై నిరంతర సచ్చిదానందానుభూతి నందుచున్న వాడెవడో ఆతడే అతి వర్ణాశ్రమిగా శాస్త్రములు దెల్పుచున్నవి.

శ్లో॥ యో దేవో ప్రతిమాకారో లోహబుద్ధిం కరోతి చ ।
యో గురౌ మానుషం భావ ముభేసరక పాతినౌ ॥

శ్లో॥ యథా గురు స్తథైవేశో యథై వేశస్తథా గురుః ।
పూజనీయో మహాభక్త్యా నభేదో విద్యతేఽనయోః ॥

దేవునియందు లోహమయమగు ప్రతిమయను భావన గలవాడు, గురునియందు మనుష్యుడను భావముగలవాడు. ఇట్టి వారిరువురు నరకమును జెందగలరు. తన దైవమునందెట్టి భావముగలదో అట్టి భావమే గురువునందున, గురువునం దెట్టిభావముగలదో అట్టి భావమే దేవుని యందున కలిగి గురుదేవులను భక్తిభావముతో అభేదముగా నర్చించు పాసకుడే యోగ్యుడు – చరితార్థుడు కాగలడు.

## శిష్యుని కుండదగిన అర్హతలు

శ్లో॥ శాంతో వినీతః శుద్ధాత్మా శ్రద్ధవాన్ ధారణక్షమః ।
సమర్థశ్చ కులీనశ్చ ప్రాజ్ఞః సచ్చరితో బుధః ।
ఏవమాది గుణైర్యుక్తః శిష్యోభవతి నాన్యథా ।
గురుతా శిష్యతా వాపి తమూర్వత్సర వాసతః ॥

శాంతముగలవాడు, వినీతురు, నిష్కల్మషమగు మనస్సుగలవాడు, శ్రద్ధాశక్తులుగల్గి చెప్పినది ధారణజేసికొనగలిగినవాడు, సమర్థుడు, మంచి వంశమునకు జెందినవాడు, దూరాలోచన గావించువాడు, చక్కని నడవడిక గలవాడు, బుద్ధిమంతుడునగువాడు, యోగ్యుడైన గురువునొద్ద శిష్యునిగా నుండుటకు అర్హుడైయున్నాడు.

శ్లో॥ రాజ్ఞిచామత్యదోషాః పత్నీ పాపాని భర్తరి ।
తథా శిష్యార్జితం పాపం గురుం ప్రాప్నోతి నిశ్చితమ్ ॥

మంత్రులు గావించిన దోషములు, రాజునకు, భార్యగావించిన పాపములు భర్తకు నేవిధముగా సంక్రమించునో అదే విధముగా శిష్యుడు చేసిన పాపములు గురువు నాశ్రయించగలవు. కావున శిష్యుని యోగ్యా యోగ్యతలు గురువును, గురువు యొక్క యోగ్యా యోగ్యతలు శిష్యుడును ప్రారంభమునందే పరీక్షించు కొనవలెనని శాస్త్రవచనము.



శ్లో॥ గురుశిష్యావుభౌ మోహాదపరీక్ష్య పరస్పరం ।
ఉపదేశం దదద్ గృహ్ణాన్ ప్రాప్నుయాతాం పిశాచతామ్ ॥

గురువు శిష్యుని, శిష్యుడు గురువును పరస్పరము పరీక్షించుకొనక ఏకారణములచేతనైనను ఉపదేశము గావించినను, శిష్య డుపదేశము నందినను అట్టి గురుశిష్య లుభయులు పిశాత్వమునందగలరు. కావున గురుగుణములు, అతని శక్తిని శిష్యుడు, శిష్యుని యోగ్యత, అతని ప్రవర్తనా మనోధర్మములను గురువు తప్పక పరీక్షించి-యోగ్యములుగా నిరువురు గుర్తించిన పిమ్మటనే ఉపదేశ కార్యమును నిర్వహించుట శాస్త్రవిహితము.

## ఉపదేశకాల నిర్ణయము

శ్లో॥ మధుమాసే భవేద్దఃఖం మాధవే రత్నసంచయః ।
మరణం భవతిజ్యేష్ఠే అషాఢే బంధు నాశనమ్ ॥

సమృద్ధిః శ్రావణే మానం భవే ద్భాద్రపదే క్షయః ।
ప్రజానామాశ్వినేమాసి సర్వతః శుభమేవహి ॥

జ్ఞానం స్యాత్కార్తికే సౌఖ్యం మార్గశీర్షే భవత్యపి ।
సౌషేజ్ఞానక్షయో మాఘే భవే న్మేథా వివర్ధనమ్ ॥
ఫాల్గునేసి సమృద్ధిస్యా న్మలమాసం పరిత్యజేత్ ॥

మంత్రోపదేశము నందుటకు చైత్రమాసమునందైన దుఃఖప్రదము, వైశాఖమాసము రత్నవృద్ధి, జ్యేష్ఠము మరణప్రదము, ఆషాఢము బంధునాశనము, శ్రావణము సర్వసమృద్ధి, భాద్రపదము క్షయత్వము, ఆశ్వీయుజము సంతానవృద్ధి, కార్తీకము జ్ఞానము, మార్గశీర్షము సౌఖ్యము, పుష్యమాసము జ్ఞానక్షయము, మాఘము మేథావృద్ధి, పాల్గుణము సర్వ సమృద్ధిని కలుగజేయగలవు. మలమాసము (అధిక-క్షయమాసములు) నిషేధించబడినది

శ్లో॥ పూర్ణిమా పంచమీచైవ ద్వితీయా సప్తమీ తథా ।
త్రయోదశీ దశమీ ప్రశసాః సర్వకామదాః ॥

శ్లో॥ ద్వితీయా పంచమీ వాపి షష్ఠీచాపి విశేషతః ।
ద్వాదశ్యా మపికర్తవ్యం త్రయోదశ్యా మథాపివా ॥

విదియ, పంచమీ, సప్తమీ, దశమీ, త్రయోదశీ, పూర్ణిమాతిథులు మంత్రోపదేశమునకు యోగ్యములు, మంత్రసారాది గ్రంథములందు విశేషముగా షష్ఠీ, ద్వాదశీతిథులు కూడా దెలుపబడినవి.

శ్లో॥ శుక్ల పక్షే శుభాదీక్షా కృష్ణే ఉ ప్యా పంచమీ దినాత్ ॥

అని దెల్పుటచే శుభకరమైన మంత్రదీక్షను గైకొనుటకు శుక్లపక్షము అన్నివిధములుగా బ్రశస్తమై యున్నది. కృష్ణపక్షమునందు పంచమివరకు దోషములేదు.

శ్లో॥ రవే గురౌ తథా సోమే కర్తవ్యం బుధ శుక్రయోః ।

ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు మంత్రదీక్ష నందుటకు శుభప్రదములు, మంగళ, శనివారములు నిషిద్ధములు.

శ్లో॥ రోహిణీ శ్రవణార్ద్రా చ ధనిష్ఠా చోత్తరాత్రయమ్ ।
పుష్యః శతభిషశ్చైవ దీక్షా నక్షత్ర ముచ్యతే ॥

రోహిణీ, ఆరుద్ర, పుష్యమి, ఉత్తర, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర అను నక్షత్రములు మాత్రమే దీక్షను (మంత్రదీక్ష) స్వీకరించుటకు యోగ్యములుగా దెలుపబడినవి. ఈ నారద తంత్ర వచనమునందు లేని మరికొన్ని నక్షత్రములుకూడా యోగ్యములుగా స్వీకరింపవచ్చునని ఇతర గ్రంథములద్వారా దెలియుచున్నది. అట్లుపయుక్తము లగు వానిలో అశ్వని, మృగశిర, పునర్వసు, మఖ,పుబ్బ, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, రేవతి అను నక్షత్రములుగలవు.

శ్లో॥ మంత్రా ద్యారంభణం మేషే ధనధాన్య సుఖప్రదమ్ ।
వృషే మరణ మాప్నోతి మిధునే పుత్రనాశనమ్ ॥
కర్కటే సర్వసిద్ధిస్స్యా త్సింహే మేథా వినాశనం ।
కన్యాయాం సిద్ధిదో జూకేర్ధి ఫలో వృశ్చికే ర్థదః ॥
మకరే పుత్రదః కుంబే మహద్ధనవి వృద్ధిదః ।
మీనం దుఃఖప్రదం నిత్య మేవం రాశిఫలం శివే ॥



మంత్రోపదేశకాలము మేషలగ్నముగా నుండిన ధనధాన్యసుఖములు చేకూరగలవు, వృషభమైన మరణము, మిధునమైన పుత్రనాశనము, కర్కాటకమైన సర్వసిద్ధులు, సింహమైన మేధావినాశనము, కన్యయగునేని మంత్రసిద్ధి, తులారాశి అల్ప ఫలసిద్ధి, వృశ్చికమైన ధనసంపత్తి, ధనూరాశియైన శుభప్రాప్తి, మకరమైన పుత్రసంతతి, కుంభమైన మహాధనవృద్ధి మీనమైన యెడల దుఃఖము ప్రాప్తించగలవు.

శ్లో॥ శుభః సిద్ధిశ్చ ఆయుష్మాన్ ధృవయోగ స్తతఃపరం ।
ప్రీతిః సౌభాగ్యయోగశ్చ వృద్ధియోగ స్తతః పరమ్॥
హర్షణశ్చ తథా యోగాః సర్వమంత్రే శుభావహాః ॥

శ్లో॥ కౌలువ స్తైతుల బవే వణిజ స్తదనంతరం ।
కరణాని శుభాన్యేవ సర్వ మంత్రేషు భామినీ ॥

సిద్ధి, ఆయుష్మాన్, ధృవ, ప్రీతి, సౌభాగ్య, వృద్ధి, హర్షణ అను యోగములు, కౌలువ, తైతుల, బవ, వణిజి అను కరణములు మంత్రదీక్ష గైకొనుటకు శుభప్రదములని విశ్వసార గ్రంథము దెల్పుచున్నది. మంత్రోపదేశమునంది ఉపాసనాదీక్ష గైకొనుటకు శుభకాలము లీ విధముగా దెలియజేయబడినప్పటికీ కొన్ని ప్రత్యేక యోగములందు కాలనియమముతో పనిలేకనే దీక్ష స్వీకరింపవచ్చును.

## ఉపదేశమునకు కాలనియమములేని సమయములు

శ్లో॥ నింద్యాది ష్వపి కాలేషు దీక్షోక్తా గ్రహణే శుభే ।
సూర్యగ్రహణ కాలేన సమానోనాస్తి భూతలే ॥
తత్ర యద్యకృతం సర్వ మనంత ఫలదం భవేత్ ॥

శ్లో॥ రవి సంక్రమణేచైవ సూర్యస్య గ్రహణే తథా ।
తత్ర లగ్నాదికం కించి న్న విచార్యం కథం చన ॥
సత్తీర్థే ఉ ర్క విధుగ్రానే పుణారణ్యే వనేషు చ ।
మంత్రీం దీక్షాం ప్రకుర్వాణో మానర్షాదీ న్న శోధయేత్॥

**అమావాస్యా సోమవారే భౌమవారే చతుర్దశీ ।**
**సప్తమీ రవివారేచ సూర్య పర్వశతైః సమాః ॥**
**న కుర్యా చ్ఛాక్తికీం దీక్షా ముపరాగే విభావసోః ।**
**న కుర్యా ద్వైష్ణవీం దీక్షాం యది చంద్రమసోగ్రహః ॥**
**పుణ్యతీర్థే కురుక్షేత్రే దేవీపీఠ చతుష్టయే ।**
**ప్రయాగే శ్రీగిరౌ కాశ్యాం కాలాకాలం నశోధయేత్ ॥**

యోగ్యముకాని దినములయం దైనప్పటికీ సూర్యగ్రహణ సమయంలో మంత్రదీక్ష నందుట అనంత ఫలప్రదము. ఇట్టి గొప్పకాలముతో సమానమగుకాలము భూతలమునందున మరేదియు నుండదు.

రవి సంక్రమణమునందు, (సూర్యునిరాశి ప్రవేశకాలము) సూర్యచంద్రగ్రహణములయందు, పుణ్యతీర్థములందు, నైమిశారణ్యాది పుణ్యారణ్యములందు, కదంబవనాది పుణ్యవనములందు, కురుక్షేత్రమునందు, దేవీపీఠచతుష్టయములందు, ప్రయాగయందు, శ్రీశైలమునందు, కాశీయందు శుభాశుభకాలములను పరిగణింపకనే మంత్రదీక్ష నందవచ్చునని యామళ గ్రంథము దెల్పుచున్నది.

సోమవారముతో గూడిన అమావాస్యయు, మంగళవారముతో గూడిన చతుర్దశియు, ఆదివారముతోగూడిన సప్తమియు నూరు సూర్యపర్వములతో సమానమైన దినములు, సూర్యగ్రహణ సమయమునందు శక్తిసంబంధమగు మంత్రదీక్ష నొసంగుట కూడదు. అదేవిధముగా చంద్రగ్రహణ సమయమున వైష్ణవమంత్రదీక్ష నొసంగుట నిషేధించబడినది.

శ్లో॥ **దేవీబోధం వామారభ్య యాదత్యా న్నవమీ తథా ।**
**కృతాతాసు బుద్ధై ర్దీక్షా సర్వాభీష్ట ఫలప్రదా ॥**

శ్లో॥ **బోధనేచైవ దీక్షయాః కాలాకాలం నశోధయేత్ ।**
**అశోకాఖ్యాష్టమీ చైవ రామాఖ్యా నవమీ తథా ॥**
**లగ్నే వాప్యథవాఽలగ్నే యత్ర తత్ర తిథావపి ।**
**గురోరాజ్ఞాను రూపేణ దీక్షా కార్యా విశేషతః ॥**

ఆశ్వీయుజ శుక్లపాడ్యమి తిథినుండి నవమీతిథి వరకు (శరన్నవ రాత్రములు) ఏదినమందైనను మంత్రదీక్ష నందుటవలన సమస్తాభీష్టములు



సిద్ధించగలవు. మరియు బోధవైకాదశీ (కార్తీకశుద్ధ ఏకాద) తిథియందు అశోకాష్టమి (చైత్రశుక్ల అష్టమి) యందు శ్రీరామనవమి యందు శుభాశుభములు గణింపకనే గురువుయొక్క ఆజ్ఞతో మంత్రదీక్ష నందవచ్చును.

శ్లో॥ **శిష్యా నాహూయగురుణా కృపయాదీ యతేయదా ।**
**తదాలగ్నాదికం కించి న్నదిచార్యం కథం చన ॥**
**సర్వే వారాః గ్రహాః సర్వేనక్షత్రాణి చ రాశయః ।**
**యస్మి న్నహని సంతుష్టోగురుః సర్వే శుభావహాః ॥**

గురువు శిష్యునియందుగల వాత్సల్యముతో తనకు తానుగా బిలచి మంత్రదీక్ష నొసంగిన అట్టి సమయమునకు శుభాశుభములతోటి నిమిత్తము లేదు. గురువు సంతసించి అనుగ్రహముకల్గియున్న సమయమునందు సమస్త వార నక్షత్రరాశులు, గ్రహములు, కాలము అత్యంత శుభప్రదమై యుండగలదు.

శ్లో॥ **విధవాయాః సుతాదేశాన్ కన్యాయాః పితు రాజ్ఞయా ।**
**నాధికారః స్వతోనార్యా భార్యాయాభర్తు రాజ్ఞయా ॥**

మంత్రోపదేశమునంది ఉపాసనాదీక్ష స్వీకరించుటకు స్త్రీలకు స్వతంత్రాధికారము లేనందున కన్యలు తండ్రియొక్క ఆజ్ఞనందియు, గృహిణులు తమ భర్త అనుమతితోడను, భర్తృవిహీనలు కుమారుని అనుమతినందియు మంత్రదీక్షాదులను గైకొనవలెను.

## ఉపదేశమిచ్చుట కర్హులు

శ్లో॥ అశాస్త్రీయోపదేశం తు యోగృహ్ణాతి దదాతితుః ।
భుంజాతే తావుభౌ ఘోరాన్నరకా నేకదింశతిః ॥

శాస్త్ర ప్రతిపాదితముగాని విధానముల ననుసరించి మంత్రము పదేశించెడు గురువు, అట్టి శ్రుతి స్మృతి విహితముగాని పద్ధతులద్వారా మంత్రోపదేశము నందెడు శిష్యుడు. వీరిరువురును ఘోరములైన ఏకవింశతి (21) మహానరకములపాల్పడగలరు. కావున **"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ"** అను గీతావచనము ననుసరించి మంత్రశాస్త్ర విధులను లెస్సగాగుర్తెరింగి యోగ్యతగల శిష్యునికి మాత్రమే పరమ యోగ్యుడగు గురువు మంత్రోపదేశము గావించి అమ్నాయ సంస్కారములద్వారా పునీతుని గావించి దీక్షా ప్రవేశము జరిపించవలసియున్నది.

శ్లో॥ యతేర్దీక్షా పితుర్దీక్షా యాదీక్షా వనవాసినః ।
వివిక్తా శ్రమిణోదీక్షా నసా కళ్యాణదాయకా ॥

యతులనగా సర్వసంగ పరిత్యాగ మొనర్చిన సన్యాసులు. పితృసమానులైనవారు (జ్ఞాతులు) వనవాస మొనర్చువారు (వానప్రస్థులు) చతుర్విధాశ్రమములలో ఏ ఆశ్రమమును ఆశ్రయించనివారు, మంత్రోపదేశ మొనర్చుటకనర్హులుగా దెలుపబడినారు. వీరివలన మంత్రోపదేశ దీక్షాదులను స్వీకరించిన అట్టి మంత్రములు అమంగళ హేతువులు కాగలవు.

శ్లో॥ పితుర్మంత్రం నగృహ్ణీయాత్తథా మాతామహస్యచ
సోదరస్య కనిష్ఠస్య వైరిపక్షాశ్రితస్య చ ॥

తండ్రిద్వారా మంత్రోపదేశము నందుట (గాయత్రి మినహా ఇతర మంత్రములు) దోషప్రదము, అదేవిధముగా తల్లితండ్రి (మాతామహుడు) వద్ద, సోదరునివద్ద తనకన్న వయసున చిన్నయైన వానివద్ద, శత్రుపక్షము నందున్న వానివద్ద మంత్రోపదేశము నందకూడదు.

శ్లో॥ నపత్నీం దీక్షయేద్భర్తాన పితాదీక్షయేత్సుతాన్ ।
న పుత్రం చ తథాభ్రాతా భ్రాతరం న చదీక్షయేత్ ॥



శ్లో॥ స్త్రియః శూద్రాదయశ్చాపి బోధనీయా హితాహితమ్
తథార్హా మాననీయాశ్చ నార్హం త్యాచార్యకం క్వచిత్ ॥

భార్యకు భర్తయు, కుమారులు-కూతుళ్ళకు తండ్రియు, తమ్మునికి అన్నయు, తండ్రికి పుత్రుడును, దీక్షనొసంగి మంత్రోపదేశ మొసంగకూడదు. స్త్రీలు-శూద్రులు మంచిచెడ్డలు బోధించిన వినవచ్చునుగానీ వారి వలన మంత్రోపదేశమునంది ఉపాసనాదీక్ష స్వీకరించుట నిషేధింపబడినది.

శ్లో॥ గురుత్యాగా భవే న్మృత్యుం మంత్రత్యాగాద్దరిద్రతా
గురుమంత్ర పరిత్యాగా ద్రౌరవం నరకం వ్రజేత్ ॥

తనకు మంత్రదీక్ష నొసంగి జ్ఞానమార్గావలంబకునిగా తీర్చిదిద్దు యోగ్యుడైన గురువు నెన్నటికీ త్యజించకూడదు. లోభమోహాది కారణములచే అట్టి గురువును త్యజించిన వానికి మరణ మాసన్నము కాగలదు. అట్లే ఏకారణములేకుండా తాననుష్ఠించు మంత్రమును వదలివేయకూడదు. మంత్రమును అనుష్ఠింపక వదలినయెడల దరిద్రము ప్రాప్తింపగలదు. గురుమంత్రములను త్యజించువాడు రౌరవ నరకము నందగలడని శాస్త్రప్రమాణము గలదు.

శ్లో॥ గృహీత మంత్రస్త్యక్తవ్యో గురుశ్చే ద్దోష సంయుతః ।
మహాపాతకయుక్తో వా పునశ్చేద్దేవ నిందకః ॥

శ్లో॥ జ్ఞానహీనో గురుస్త్యాజ్యో మిథావాదీ విడంబకః ।
స్వవిశ్రాంతిం నజానాతి పరశాంతి కరోతి కిమ్ ? ॥

కాలధర్మము ననుసరించిగానీ, కామక్రోధలోభ మోహాదులచేగానీ కారణాంతరమున గురువు జ్ఞానహీనుడై, మిధ్యావాద డాంబికా, భేషజ, స్వార్థపరత్వాది దుర్లక్షణయుక్తుడైనప్పుడు తనను తానే ఉద్ధరించుకొనలేని ఆగురు వితరుల నుద్ధరింపజేయలేడు గాబట్టి అట్టి గురువును - ఆ గురు నొసంగిన మంత్రమును పరిత్యజింప వచ్చునని ధర్మశాస్త్రములు దెల్పుచున్నవి. దైవనింద, గో బ్రాహ్మణ యతి నిందలు గావించు గురువుని సైతము వదలివేయవచ్చును.

శ్లో॥ శుభలక్షణ సంపన్నో గురుస్సాక్షాత్పితా మహః ।
విరుద్ధ లక్షణోపేతో దూరతః పరివర్జయేత్ ॥

శుభప్రదమైన శమదమాది వేదచోదిత లక్షణములుగల గురువే యోగ్యుడు. అట్టి గురువు బ్రహ్మదేవునితో సమానమైవాడు. వేదబాహ్యమగు ఆచార వ్యవహారములుగల్గి శ్రుతి స్మృతి విరుద్ధ లక్షణములుగల గురువును దూరముగా విడచివేయవలెను.

## గురూపదేశము లేకనే జపించదగు మంత్రములు

**శ్లో॥ దైవదత్తం తథా స్వప్నం నభశ్చ గురుదత్తకం ।**
**మాత్రుదత్తం శుభేన్మంత్రం జపార్హమిత్య సంశయః ॥**

పూర్వపుణ్య వశముచే దేవతలు సాక్ష్యాత్కరించి యొసంగిన మంత్రములు, స్వప్నమునందు నెవ్వరేని అనుగ్రహించినన మంత్రములు కృపకల్గి గురుతుల్యులగువారు చెప్పిన మంత్రములు, కన్నతల్లి చెప్పిన మంత్రములు శుభప్రదమైనవి గావున వాటిని గురూపదేశము లేదను సంశయమును వీడి జపించవచ్చును.

## దీక్షా ప్రాధాన్యత

**శ్లో॥ అదీక్షితా యేకుర్వంతి జపపూజాదికాః క్రియాః ।**
**నభవంతి ప్రియే ! తేషాం శిలాయాం న్యస్తబీజవత్ ॥**

**శ్లో॥ దేవీ! దీక్షావిహీనస్య నసిద్ధిర్నచ సద్గతిః ।**
**తస్మాత్సర్వ ప్రయత్నేన గురునాదీక్షితో భవేత్ ॥**

గురువుద్వారా మంత్రదీక్ష నందని వాడొనర్చు జపము, పూజ, మొదలగు క్రియలన్నియు నిష్ఫలములే కాగలవు. రాళ్ళపై జల్లిన విత్తులే విధముగా మొలకలెత్తవో? అదే విధముగా దీక్షలేనివాని వైదికకర్మలు కూడా ఫలవంతములుగానేరవు. మంత్రదీక్షలేనివానికి, ఆ మంత్రముయొక్క సిద్ధిగాని, సద్గతులుగానీ లభించవు గావున ప్రయత్న పూర్వకముగా గురువువలన మంత్రదీక్షను పొందవలసియున్నది.

**శ్లో॥ కల్పేద్దృష్ట్వాతు మంత్రం వైయోగ్యృహ్ణాతి నరాధమః ।**
**మన్వంతర సహస్రేషు నిష్కృతిర్నైవ విద్యతే ॥**



అనేకానేక కల్పములుగా వ్రాయబడియున్న మంత్రశాస్త్ర గ్రంథములు జూచి (దీక్షారహితుడై) మంత్రములను గ్రహించి అనుష్టించువాడు నరాధముడై వేయి మన్వంతర కాలములవరకు విద్యాజ్ఞాన హీనుడై (నిష్కృతిలేక) జన్మింపుచుండగలడు **"సద్గురో రాహితా దీక్షా సర్వకర్మాణి సాధయేత్"** అని జెప్పబడినందున సద్గురువు నాశ్రయించి ఉపాసనాయు పయుక్తమగు దీక్షను గైకొనినయెడల స్వకీయ-పరకీయములగు అన్ని కర్మలు సాదన కాగలవు.

**శ్లో॥ దీక్షామూలం జపం సర్వం దీక్షామూలం పరం పతః ।**
**దీక్షామాశ్రిత్య నివసే ద్యత్ర కుత్రాశ్రమే వసన్ ॥**

జపము-తపము-పూజ-మొదలగాగల వైదిక కర్మలన్నియు దీక్ష నాశ్రయించి యున్నవి. ఏ ఆశ్రమమునం దున్నవారైనను ఆ ఆశ్రమమునకు సంబంధించిన దీక్ష నాశ్రయించే యుండవలెను. కావున మంత్రవిదుడగు విప్రుడు గురుదీక్ష నందుట ముఖ్యము.

## దీక్షా స్వరూపము

**శ్లో॥ దీక్షా చతుర్విధా ప్రోక్తాం క్రియావత్యాది భేదతః ।**
**క్రియామయీ వర్ణమయీ కళాత్మావేద మయ్యపి ॥**

దైవము (దేవతలు) మంత్రాధీనము :- ఆ మంత్రము గుర్వధీనమగుట వలన సద్గురుని సేవించి దీక్షితుడైనవాడే మంత్రసిద్ధినంది తద్వారా దైవమును ఆత్మస్థ మొనర్చుకొనుటకు జ్ఞానసిద్ధి పడయుటకు సమర్థుడగు చున్నాడు.

మంత్రోపదేశ మొసంగుటకు ముందు గురువు శిష్యునికి దీక్ష నొసంగవలెను, ఈ దీక్ష కల్పములందు అనేకవిధములుగా దెలుపబడినను సర్వదీక్షా సారములైయున్న దీక్షలు నాలుగు విధములుగా మంత్రవేత్తలచే గైకొనబడినవి.

1. క్రియామయీదీక్ష 2. వర్ణమయీదీక్ష 3. కళామయీ దీక్ష 4.వేదమయీదీక్ష, వీటిద్వారా శిష్యునికి బాహ్యాభ్యంతర శుద్ధిని, జ్ఞానచైతన్య ప్రాప్తిని కలిగించి మంత్రవిద్యను గురుడుపదేశించును.

**1. క్రియామయీదీక్ష :-**

ప్రధానమగు పదిక్రియలచే నిరూపతమైయున్నది. గావున దీనికి క్రియామయీదీక్ష యని పేరుకల్గినది. స్నాన, సంధ్యా, ప్రాణాయామ, భూతశుద్ధి, న్యాస, ధ్యాన, పూజాదులనొనర్చి, శాస్త్రవిధిగా హోమములు జరిపి షడధ్వాశోధన క్రమముగా వేరువేరు ఆహుతులచే బరమాత్మయందు విలీనమొనర్చి, సృష్టిక్రమముగా శిష్యునకు చైతన్యమును ప్రసాదించవలెను. ఇందువలన శిష్యుడు పరిశుద్ధదేహుడు కాగలడు.

**2. వర్ణమయీదీక్ష :-**

న్యాసరూపమగు ఈ దీక్షయందు అకారాది మాతృకలచే ప్రకృతి పురుషాత్మకమగు వర్గములు విభజించి, అట్టి ప్రకృతి వర్గులచేత, పురుష వర్గులచేత శిష్యుని దేహమును న్యాసమొనరించి, గురువు తన యొక్క ఇచ్ఛాశక్తివలన వర్ణములను బ్రతిలోమవిధిగా శిష్యుని శరీరమునందు విలీనము గావించుటచే శిష్యునిదేహమునకు దివ్యత్వము ప్రాప్తించగలదు. అట్లు దివ్వత్వమందిన శిష్యుశరీరమును సృష్టిక్రమముగా న్యసించి ఉపాసనా యోగ్యుని గావించవలెను.

**3. కళామయీదీక్ష :-**

మానవ దేహమునం దిమిడియున్న నిద్రాణములగు ఐదుశక్తులను మేల్కొల్పి అనులోమ విలోమ క్రమముగా ఆశక్తుల నొకదానియందొకటిని లయమొనర్చుటయే కళావతీదీక్ష. పాదములనుండి మోకాళ్ళ వరకు నివృత్తి కళయు, మోకాళ్ళనుండి బొడ్డువరకు ప్రతిష్ఠాకళయు, నాభినుండి కంథమువరకు విద్యాకళయు, కంఠమునుండి లలాటమువరకు శాంతికళయు, లల్లాటమునుండి శిరోంతమువరకు శాంత్యతీతాకళయు సుప్రతిష్ఠములై యుండగలవు.

గురువు సృష్టి సంహారక్రమముల ననుసరించి శిష్యదేహమందు నిద్రాణమైన ఈ పంచకళల నుద్బోధించిన పిమ్మట నివృత్తికళను ప్రతిష్ఠాకళలోనికి, ప్రతిష్ఠాకళను విద్యాకళలోనికి, విద్యాకళను శాంతికళలోనికి, శాంతికళను శాంత్య తీతాకళలోనికి ప్రవేశింపజేసి, పంచకళా పరిపూర్ణత



నందియున్న ఆశాంత్యతీతాకళను పరమాత్మయందు విలీనముగావించి, శిష్యుని పరమాత్మ రూపునిగా భావించి మరల సృష్టిక్రమముచే పరమాత్మనుండి శాంత్యతీతకళను–అదేవిధముగా మిగిలిన నాల్గు కళలను వేరుజేయుటవలన శిష్యునకు జ్ఞానము ప్రాప్తించి దేవతాభావము, దివ్యజ్ఞానము లేర్పడగలవు.

**4. వేదమయీదీక్ష:-**

ఇది శరీరాంతర్గత షట్చక్ర వేదమునకు సంబంధించినది. గురువు శిష్యదేహమునందలి మూలాధార, స్వాధీష్ఠాన, మణిపూర, ఆవాహత, విశుద్ధ, ఆజ్ఞేయ చక్రముల నధివశించియున్న దేవతలను ధ్యానించి వారి నందరిని కుండలనీశక్తిలో విలీనమొనర్చి, కుండలీ సహితముగా నీశక్తులను బిందువునందు విలీనము గావించిన పిమ్మట ఆ బిందువును కళయందు, కళను నాదమునందు, నాదాంతమునందు దానిని ఉన్మనేయందు, ఉన్మనిని విష్ణుముఖమందు తదుపరి గురుముఖమునందు విలీనము గావించిన యెడల శిష్యునికి భవపాశములన్నియు దొలగి విశుద్ధ జ్ఞానప్రాప్తి నందగలడు. అటుపిమ్మట షడాధార కుంభాభిషేకము శిష్యునికి గావించి దీక్షానామకరణాది కృత్యములు జరిపి పిమ్మట మహావిద్య యనబడు శ్రీవిద్య నుపదేశింపవలెను.

## ఉపాంగ దీక్షలు

శ్లో॥ స్పర్శాఖ్యాదేవి దృక్సం జ్ఞామానసాఖ్యా మహేశ్వరీ ।
క్రియాఽ ఽ యాసాది రహితాదేవి! దీక్షా త్రిధా స్మృతా॥

1. స్పర్శదీక్ష 2. దృక్‌దీక్ష 3. మానసదీక్ష (ధ్యాన) అనునవి మూడును క్రియామయీ దీక్షాంగములుగా దెలుపబడినవి.

శ్లో॥ యథాపక్షి స్వపక్షాభ్యాం శిశూం సంవర్ధయే చ్ఛనైః ।
స్పర్శదీక్షోపదేశశ్చ తాదృశః కథితః ప్రియే ॥

పక్షిగ్రుడ్లను రెక్కలచేత కప్పియుంచి శిశువులుగామార్చు విధము గానే గురువు శిష్యుని తన రెండు హస్తములతోటి స్పృశించి ఆశీర్వదించి మంత్రోపదేశము నొసంగవలెను. ఇది స్పర్శదీక్షగా జెప్పబడినది.

శ్లో॥ స్వాపత్యాని యథాకూర్మీ వీక్షణేనైవ పోషయేత్ ।
దృగ్దీక్షాఖ్యోపదేశస్తుతా దృశః కధితః ప్రియే ॥

ఆడతాబేలు తన చూపులచేతనే పిల్లలను పోషించు విధముగా గురువు తన కరుణాదృష్టులతో శిష్యుని వీక్షింపుచు మంత్రోపదేశమును గావించి దీక్ష నొసంగవలయును. దీనిని దృక్దీక్ష యందురు.

శ్లో॥ యథామత్సీ స్వతనయాన్ ధ్యాన మాత్రేణ పోషయేత్
వేద దీక్షోపదేశస్తు మనసః స్యాత్తథా విధః ॥

చేప తన పిల్లలను మానసిక ధ్యానమువలననే పోషించువిధముగా గురువు స్థిరమైన తన సంకల్ప-ధ్యానబలములను శిష్యునిపై కేంద్రీకరించి మంత్రదీక్ష నొసంగవలెను; ఇది వేద (మానస) దీక్షగా పేర్కొనబడినది.

## మంత్రోపదేశ క్రమము

శ్లో॥ వేదాభ్యాసైక నిరతో దేవీభక్తి సమన్వితః ।
ఆదౌ శరీరశుద్ధ్యర్థం పాయశ్చిత్తం సమాచరేత్ ॥

కేశశ్మశ్రూ న్యాపయిత్వా స్నాత్వాపుణే జలాశయే ।
పంచమృత్తికాయాస్నానం భస్మోద్ధూళన పూర్వకమ్ ॥

పాతకం తస్య నాశార్థం కూష్మాండీ భిస్తు హోమయేత్ ।
సర్వపాపక్షయే తత్ర భవేద్దీక్షాధి కారితా ॥

వేదాభ్యాస నిరతుడైనను, దేవీభక్తికలిగి యున్నవాడైనను మంత్రదీక్ష నందుటకు పూర్వము శరీరశుద్ధికొరకై ప్రాయశ్చిత్తకర్మ నాచరించవలెను అటుపిమ్మట వెంట్రుకలు, గోళ్ళు తొలగించుకొని పుణ్యతీర్థములలో స్నానము గావించవలెను. పుట్టమట్టి, మారేడుచెట్టు మొదలునందు గల మట్టి, రావిచెట్టు మొదలునందుగలమట్టి, రథ, గజశాలలయందుగల మట్టి అను పంచ మృత్తికలచేతను, విభూతిచేతను అఘమర్షణ సూక్తాదులతో స్నానముగావించి, మహాపాతకోపపాతక నివృత్తికొరకు కూష్మాండ హోమము నాచరించవలెను. అప్పుడు సర్వపాప వినిర్ముక్తుడై మంత్ర దీక్ష నందుట కర్హుడు కాగలడు.



శ్లో॥ ప్రాయశ్చిత్త మకృత్వాతు ద్విజానాం నాధికారితా॥

యని ప్రమాణవచన ముండుటచే వేదవిద్వరుడైన ద్విజుడైప్పటికీ ప్రాయశ్చిత్త కర్మలు నెరవేర్చనిదే మంత్రోపదేశమునకు - దీక్షాస్వీకారమునకు అధికారులుకాలేరు కోరికలు గలవారు తమ కోరికలు ఫలించుటకు, నిష్కాములు ముక్తినందుటకు ఇహజన్మయందు జ్ఞానాజ్ఞానాదులచే సంప్రాప్తమైన పాపనివృత్తి కొరకు ప్రాయశ్చిత్తకర్మను తప్పక నాచరించవలెను.

శ్లో॥ దృష్టిబంధం ప్రకుర్వీత యధావత్తద నంతరం ।
గురోర్దక్షిణ భాగేతు శిష్యం స్వస్థం సమాహితమ్ ॥
పంచగవ్యం తదా దద్యా ద్విద్యా తత్త్వేన దేశికః ।
ప్రాశయిత్వాఽథ తం శిష్యం పశ్చాద్దీక్షాం ప్రవర్తయేత్॥

శుచియగు వస్త్రాదులు ధరించి, సంధ్యావందనాది నిత్యకర్మలు నిర్వర్తించి గురువునకు దక్షిణభాగంలో శిష్యుడు సమాహితచిత్తుడై కూర్చుండవలెను. అప్పుడు విద్యాతత్త్వముచే గురువు పంచగవ్యముల నభిమంత్రించి శిష్యునిచే ప్రాశనజేయించిన పిమ్మట దీక్షాకార్యక్రమములకు గడంగవలెను.

శ్లో॥ ముహూర్తే సర్వతో భద్రే నవకుంభం నిధాయచ ।
సోదకం గంధ పుష్పాభ్యా మర్చితం వస్త్రసంయుతమ్ ॥
సర్వౌషధి నవరత్న పంచపల్లవ సంయుతమ్ ॥
తతో దేవార్చ సంకృత్వా హునే దష్టోత్తరం శతమ్॥
శిష్యం స్వలం కృత్యం వేద్యా ముపాస్య ముపసం విశేత్ ।
మంత్రితైః ప్రోక్షణీ తోయైః శాతకుంభజలైస్తథా ॥
మూలమంత్రేణాష్ట శతైర్మం త్రితై రభిషే చ యేత్ ।
అథ సంపాదయే స్మంత్రం హస్తం శిరశిధారయన్॥
నమోఽ స్త్వి త్యక్షతాన్ దద్యాత్తతః శిష్యోర్చయేద్గురుమ్॥

మంత్రోపదేశమునకు నిర్ణీతమైన శుభముహూర్త కాలమునందు సర్వతోభద్ర పీఠమున క్రొత్తదైన కలశమును స్థాపించి అందుదకములు, గంధపుష్పాక్షతలు, సర్వౌషధి, నవరత్న పంచ పల్లవాదుల మునిచివస్త్ర సహితముగా ప్రధాన దేవతాహావనముగావించి, విద్యుక్తముగా నర్పించిన

పిమ్మట మూలమంత్రముచే నూట ఎనిమిది పర్యాయములు హవనము గావించి తరువాత అలంకృతుడైయున్న శిష్యుని చేరబిలచి ప్రోక్షణీపాత్ర యందలి యుదకములతోడను, మంత్రితములగు శాతకుంభ జలములతో డను మూలమంత్రమును అష్టోత్తరశతము జపించుచు అభిషేకించవలెను.

తదనంతరము తన రెండు హస్తములు (దక్షిణహస్తమును) శిష్యునిశిరముపై నుంచి **"నమోఽస్తు"** (సముడవైతివి) యని యుచ్చరించి అక్షతలు శిష్యుని శిరముపైవేసి, మంత్రోపదేశమును గావింపవలెను.

**శ్లో॥ న్యాసజాలం తన్యదేహే గురుః సన్నస్య యత్నతః ।**
**దక్షకర్ణే వదేన్మం త్రమృష్యాదిక సమన్వితమ్ ।**
**తథా తస్మిన్ క్షణే దేవి! జపేన్మంత్రం శతాష్టకమ్ ॥**

గురువు ప్రయత్నపూర్వకముగా శిష్యుని దేహమునందు న్యాసమును గావించి సంపూర్ణ మనోసంకల్పము వహించినవాడై శిష్యుని కుడిచెవిలో ఋషి-ఛందో, దేవతా, బీజ, శక్తి, కీలకములను షడంగములతో గూడిన మహామంత్రమును మూడు పర్యాయములు పలుకవలెను. గురువుపదేశించు మంత్రమును - దానిభావమును శిష్యుడు తదేక చిత్తుడై మనసునందే భావనజేయవలెను.

**శ్లో॥ దేవతాగురు మంత్రాత్మ తత్త్వైక్యం భావయన్ముదా ।**
**శతం జపేత్త దగ్రస్థో నికటేత్రిదినం వసేత్ ।**
**నచేత్సం చారిణీశక్తి ర్గురుమేతి న సంశయః ।**
**తస్మాత్తదంతికే తస్య పూజాదేశాది కృద్వసేత్ ॥**

దేవతా-గురు, మంత్రముల నొక్కటిగా భావించి గురు సన్నిధియందా మంత్రమును నూరు పర్యాయములు జపించవలెను. అదే విధముగా మూడు దినములవరకు గురు సన్నిధిలోనుండి పూజాదులు నిర్వర్తింపుచు మంత్రజప మొనర్చవలెను. ఆవిధముగా మూడు దినములవరకు గురు సన్నిధియందుండి జపము గావింపకుండిన పంచారిణీశక్తి యనబడు మంత్రశక్తి గురువుని జేరగలడు. కావున గురుసన్నిధిలో ఉపదేశానంతరము మూడుదినములు తప్పక యుండవలెను.



**శ్లో॥ ఆచార్య దనభిప్రాప్తః ప్రాప్తశ్చాదత్త దక్షిణం : ।**
**అభ్యస్తో ఽపి సదామంత్రః శ్రేయసే నావకల్పతే ॥**

దుర్లభమైన మహామంత్రము ననుగ్రహించిన గురువును ఉచిత రీతిగా పూజించి ఆయనకు గురుదక్షిణ నొసంగవలెను. దక్షిణ నొసంగక ఆ మంత్రమును యెల్లవేళలయందు జపింపుచున్నను సిద్ధించుట దుర్లభము. అట్లు గురుదక్షిణ నొసంగకుండుట శిష్యునకు శ్రేయః ప్రదము కానేరదు.

**శ్లో॥ గురవే దక్షిణాం దద్యా త్ప్రత్యక్షాయ శివాత్మనే ।**
**సర్వస్వం వా తదర్థం వా తదర్థం వా తదాజ్ఞయా ॥**
**దద్యా త్స్వ శక్తితో భక్త్యా హ్యశక్తో యదిసర్వదా ।**
**సర్వథాఽసౌ తనాయత్తస్తేన సిద్ధిర్భవిష్యతి ॥**

ప్రత్యక్షశివ స్వరూపుడగు గురువును పూజించి-ముదమును గూర్చి గురుదక్షిణ నొసంగవలెను, గురువునకు తన సర్వస్వముగానీ లేక అందు సగముగానీ, నాల్గవవంతుగానీ అట్లుగాకున్న గురువు ఆజ్ఞాపించిన విధముగాగానీ గురుదక్షిణ నొసంగవలెను, గురుదక్షిణ నొసంగుటకు శక్తి లేనివాడు నిరంతరము భక్తి ప్రపత్తులతో గురుసేవ యొనర్చుచున్నను మంత్రము సత్ఫలసిద్ధి నందగలదు.

## లఘు మంత్రోపదేశ లక్షణమ్

**శ్లో॥ తత్రాప్యశక్తః కశ్చి చ్చే దబ్జ మభ్య ర్చ్య సాక్షతమ్ ।**
**తదంబునాభిషి చ్యాష్టవారం మూలేనకే కరమ్ ॥**
**నిధాయాష్టే జపేత్కర్ణే ఉపదేశేఽ ప్యయం విధిః ॥**

వైదికదీక్షా సాంప్రదాయముల ననుసరించి హోమన్యాసాభిషేకాత్మక మైన బృహద్దీక్షా విధానము ననుసరించుటకు శక్తిచాలనప్పుడు, శుభముహూర్తమునందు అక్షతలతో శంఖమును పూజించి దానిలోని ఉదకములను మూలమంత్రముచే నెన్మిదిమారు లభిమంత్రించి ఆ జలములచే శిష్యుని అభిషేకించిన పిమ్మట పూర్వోక్త విధిగా షడంగోపేతమగు మంత్ర మును దక్షిణ కర్ణమునందుపదేశింపవలెను.

శ్లో॥ చంద్ర సూర్య గ్రహే తీర్థే సిద్ధక్షేత్రే శివాలయే ।
మంత్ర మాత్ర ప్రకథన ముపదేశః స ఉచ్యతే ॥

సూర్య-చంద్ర గ్రహణకాలములందు, పుణ్యములగు తీర్థరాజము లందు సిద్ధాశ్రమ స్థలములందు, శివాలయమునందు న్యాసాభిషేకాదుల గావింపకనే గురువు శిష్యునికి మంత్రోపదేశము గావించవచ్చును మంత్రము గురువు పలుకుటవల్లనే ఉపదేశముగా ఆ మంత్రము యోగ్యత నందగలదు.

## శక్తిపాత లక్షణమ్

శ్లో॥ శక్తిపాతానుసారేణ శిష్యోఽనుగ్రహ మర్హతి ।
యత్రశక్తి ర్నపతతి తత్ర సిద్ధిర్నజాయతే ॥
యదాశిష్య చిద్రూపే కల్పితామోహిరూపిణి ।
మాయాదగ్ధా భవేత్ కించిత్తదా పతతివిగ్రహః ॥

గుర్వనుగ్రహము పొందినవానికిగానీ జపమెంత గావించినను శక్తిపాతము జరుగనేరదు. శక్తిపాతము కలుగనివారికి ఇహపరసిద్ధి యుండదు. జపితయొక్క చైతన్యమునందు కల్పిత మోహరూపముననున్న మాయ ఈ శక్తిపాతముచే దగ్ధమై సాధకుడు త్కృష్టస్థితికి నందగలడు.

ప్రతివానిలోను జ్ఞానమును చైతన్యశక్తి అజ్ఞానావృతమై మాయవలన నిద్రింపుచుండగలదు. చైతన్యశక్తి నావరించియున్న ఆజ్ఞానాదులే మానవునిలో భౌతిక విషయవాంఛ లాదిగాగల వాసనలను ప్రేరిపింపు చుండగలవు. జ్ఞానసిద్ధికి, పరమాత్మ ప్రాప్తికి ముఖ్యముగా అహంకారమనునది తొలగిపోవలసియున్నది. ఘోరతపస్సువలన కొన్ని దివ్యశక్తులు లభించగలవే గాని అహంకారము నశింపదు. కావున గురువుయొక్క అనుగ్రహము వలనగానీ అహంకార నాశనము సంభవించదు. గురువాసంగు స్పర్శ,దృగ్ ధ్యానదీక్షాదులచే శిష్యుడు పునీతుడై గురుదేవతానుగ్రహమువలన తనయొక్క పూర్వపుణ్యమువలన శక్తిపాతమునంది, తద్వారా అతనిలో ఆవరించబడిన ఆజ్ఞానవలయములు ఛేదింపబడి మాయదగ్ధమై జ్ఞానదీప్తి సంభవించగలదు.

శక్తి పాతము కలుగగానే జపధ్యాన క్రియాసక్తులు కాగలరు. ఉత్తమాధమ విచక్షణారహితముగా శక్తిపాతము కలుగవచ్చును. పూర్వజన్మ



వాసనలననుసరించి భగవత్కృప రెండు విధములుగా సంభవించగలదు. ఇందు 1. మాయాశక్తిపాతము 2. మాయారహితశక్తిపాతము అనునవి రెండువిధములు. మాయానహితశక్తిపాతమువలన ధనాద్యైశ్వర్య సుఖభోగములు ప్రాప్తించగలవు. మాయారహిత శక్తిపాతమువలన తపోజన ధ్యానాసక్తి జనించి మోక్షము ప్రాప్తించగలదు.

శక్తిపాతమునందు మందము : తీవ్రమను రెండు ముఖ్య స్థితులు గలవు. ఈ ద్వివిధశక్తిపాతములు సంభవించినవారికి మరల జన్మకలదు. అయితే మందశక్తి పాతమును పొందినవారు ఆస్తిక్యతకల్గి జపధ్యానాసక్తుడై భోగోపలబ్ధమగు జన్మల నందగలడు. తీవ్రశక్తిపాత మందినవాడు, జ్ఞానియై జన్మించి మాయాతీత పరిపూర్ణ పరమాత్మ తత్త్వమును దెలిసికొని తిరిగి జన్మలేని కైవల్యస్థితి నందగలడు. శక్తిపాతములు తీవ్ర, మధ్య మందములను మూడవస్థలుగల్గి, ప్రతియవస్థయందు తిరిగి మూడు ఉపావస్థల నందుచు సాధకుల యోగ్యతల ననుసరించి వారికి ప్రాప్తింపుచుండగలవు. కావున మంత్రశాస్త్ర పరమార్థగ్రహీతలు, తశ్శాస్త్రసాధకులు నగు సాధకులు గుర్వనుగ్రహముచే శక్తిపాతము నందుట ముఖ్యము.

## నవవిధ శక్తిపాతావస్థలు

### 1. తీవ్రతీవ్రము :-

ఇది పరమోత్కృష్టమగు శక్తిపాతము - ఈ శక్తి పాతము జరిగిన వెంటనే కొందరు మరణించగలరు. మరి కొందరు కొంతకాలమైన పిదపను, కొందరింకను ఆలస్యముగను మరణించగలరు. దీని వలన సంచిత పారబ్ధ, ఆగామి కర్మలయొక్క ఫలమంతయు క్షయమంది కర్మయనదిలేక జీవు డీ దేహమువదలి పరమాత్మలో లయముకాగలడు. (ఇకజన్మయుండదు).

### 2. మధ్యతీవ్రము :-

ఈశక్తిపాతమువలన దేహచ్యుతి, ప్రారబ్ధక్షయము సంభవించవుగానీ అజ్ఞానము, మాయ యనునవి నశించి స్వతః జ్ఞానవంతుడు కాగలడు. ఇట్టివానికి భగవత్ప్రేరణవలన ప్రతిభాజ్ఞానము ప్రాప్తించి ప్రయత్నరహితము

గానే ఇంద్రియము లంతర్ముఖములై ఆత్మలో నైక్యము జెందగలవు.
అప్పుడంతర్ముఖశక్తులు జనించి పరమాత్మ తత్త్వమును జయింపగలదు.

**3. మందతీవ్రము :-**

ఈ శక్తిపాతమునందు సాంసిద్ధిక, సంస్కృత గురువులలో నెవరోయొకరు లభించి దీక్ష నొసంగుటవలన తత్త్వజిజ్ఞాసాపేక్ష జనించి, యదార్థ జ్ఞానమారావలంబకులు కాగలరు. కొంతకాలమునకు పరమార్థ తత్త్వజ్ఞానమునందు లయించి జీవన్ముక్తులు కాగలరు. ఈ జీవన్ముక్తునికి సుఖ దుఃఖానుభవము ప్రారబ్ధ కర్మానుసారముగా సంభవించుచునే యుండును. కానీ వాటి ననుభవించుచున్నను మహాబుద్ధులయందు వాటియొక్క యునికి స్పర్శ లేకపోవుటచే ఆ అనుభవ కర్మఫలములు జేరజాలవు. ఇట్టివానికి దేహపాతా నంతరము భగవదైక్యము సిద్ధించగలదు.

**శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహంత్వా సర్వపాపేభ్య మోక్షయిష్యామి మాశుచ ॥**

యను గీతావాక్య మీతనియెడల వర్తించగలదు.

**4. తీవ్రమధ్యము :-**

ఈ శక్తి పాతమునందు బ్రహ్మత్వసిద్ధి వెంటనే కలుగదు. దీక్షానంతరము క్రమక్రమముగా సిద్ధింపుచుండగలదు. స్పష్టానుభవములు గూడా నుండవు. నిర్వికల్ప ఆత్మసాక్షాత్కారము నందుట దుర్లభము. కానీ మరణానంతరము పరమాత్మ ప్రాప్తి మాత్రము లభించగలదు.

**5. మధ్యమధ్యము :-**

ఈశక్తి పాతమునందు దీక్షా మంత్రోపాసనలవలన తత్త్వజిజ్ఞాసయు పరమేశ్వరప్రాప్తికై గాఢా పేక్షయు కల్గుచున్నను, భోగకాంక్ష నశింపదు. అందువలన జీవితమునందు భోగము లనుభవింపుచు మరణించినపిదప భగవసాన్నిధ్యము నందగలరు.

**6. మందమధ్యము :-**

ఈశక్తి పాతమునందు కూడా భోగకాంక్షలు వెన్నంటి నుండగలవు. పై విధముగానే తత్త్వజిజ్ఞాసపేక్షుడై మంత్రజపము గావింపుచున్నను ఈ జన్మలో



భోగములుకూడా ననుభవింపజాలదు. మరుజన్మయందు పూర్వజన్మ వాసనానువర్తియై భోగము లనుభవించి తుదకు కైవల్యము నందగలదు.

**7. తీవ్రమందము :-**

ఈశక్తి పాతమునందు ఇహభోగకాంక్షలు మిక్కుటముగా నుండగలవు. తత్త్వజిజ్ఞాన, పరమార్థచింతన లోపించగలదు. అయినప్పటికీ హృదయాంతరములయం దెక్కడో అణుమాత్రముగా పరమేశ్వర ప్రాప్త్యుద్దేశ్యము దాగియుండగలదు. వీరొనర్చు భగవదారాధన-మంత్రోపాసన కేవల ఐహిక భోగప్రాప్తికై జరుపుచు, సగుణారాధన మొనర్చుటవలన దేహపాతానంతరము ఉత్తమలోకములకేగి అచ్చట ఈ పుణ్యఫలమును భోగరూపమున అనుభవించగలరు.

**8. మధ్యమందము :-**

ఇది కూడా పైవిధముగా అతిభోగకాంక్షాదులతో గూడియుండి, ఉపాసనా సుకృతమువలన ఊర్ధ్వలోకములనుబొంది అచట భోగరతులై ఆలోకాధిపతిచే దీక్షానంది సద్గతుల నందగలరు.

**9. మందమందము :-**

ఈశక్తి పాతమునందు కూడా ఐహిక కామ్యలంపటులుగానేయుండి గురుదీక్షాశక్తివలన ఆసన్నమరణకాలమునందుగల కోర్కెల ననుసరించి, పరలోకములందు ఫలమనుభవించగలరు. అంత్యసమయమునం దుత్తమ భావములు (మోక్షాసక్తి పరమేశ్వర సాయుజ్య చింతన వంటివి) కల్గియున్న దివ్యలోకముల కేగిన పిదప అచట పరమాత్మప్రాప్తి లభించగలదు.

**శ్లో॥ అనన్యాశ్చింత యంతో మాం యేజనాః పర్యుపాసితే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥**

అనుభగవద్వాక్యాను సారముగా తీవ్రమంద, మధ్యమంద, మంద మంద యవస్థలుగల శక్తి పాతము నందినవారు నిరంతర భగవధ్యానాను రక్తులై యుండిన యెడల వారికి మోక్షము కరతలామలకము కాగలదు. కావున తన యర్హత ననుసరించి శక్తిపాతము కలిగించుగురువు నన్వేషించు టయే కష్టమైనపని. అట్టి గురువు లభించుట పూర్వజన్మ సుకృత మనవచ్చును.

శ్లో॥ దేహపాత స్తథాకంపః పరమానంద హర్షణే ।
స్వేదో రోమాం చ ఇత్యేత చ్ఛక్తి పాతస్య లక్షణమ్ ॥

క్రిందపడిపోవుట (లేక ఆకస్మికముగా మరణించుట) కంపములు కల్గుట చెమట పోయుట, వెంద్రుకలు నిక్కబొడుచుకొనుట, పరమానందము సంభవించుట, విపరీతమైన నవ్వు వచ్చుట అనునవి శక్తిపాతము జరిగినందువలన ఏర్పడు లక్షణములుగా శాస్త్రములు దెల్పుచున్నవి.

## ఉపాసనా భేదములు

మంత్రయోగమును సాధించుటకు ఉపాసన చాలాముఖ్యము, ఇట్టి వైదికాచార ప్రయుక్తమగు ఉపాసన ఉపాసకుల తారతమ్యత ననుసరించి ఆరువిధములుగా దెలుపబడినది. ఈ షడ్విదోపాసనకు మూలములైనవి. 1. ప్రతీకోపాసన 2. అహంగ్రహోపాసనయను రూపద్వయములు. ఇందలి ప్రతీకోసాపన 1. సంపదుపాసన 2. ఆరోహోపాసన 3. సంవర్గోపాసన 4. అధ్యాసోపాసన మను నాల్గు భేదములు కల్గియున్నది. అహంగ్రహోపాసన కూడా 1. సగుణాహంగ్రహోపాసన 2. నిర్గుణాహంగ్రహోపాసన యని రెండు విధములుగా నుండుటచే ఉపాసనా భేదములు ఆరుగా దెలుపబడినవి.

1. శ్లో॥ అల్పస్యచాధికత్వేన గుణయోగాద్వి చింతనం ।
అనస్తం వై మన ఇతి సఃపద్విధి రుదీరితః ॥

2. శ్లో॥ విధాదారోప్య యోపాసా రోపః పరికీర్తితః ।
యద్వదోంకార ముద్గీథ ముపాసితే త్యుదాహృతః॥

అల్పమైన అనాత్మవస్తువు లధికముగా భావించి వాటిని దేవతా దృష్టిచే సంస్కరించి, నానావిధ వృత్తిరూపమగు మనస్సును–దానిచే ప్రేరేపించబడు ఇంద్రియ చేష్టలను భగవల్లీలలుగా దలచి మనోవికారములకు లోనుగాక యుండుటయే సంపదుపాసనా లక్షణము. అనగా ప్రతి పదార్థమునందు, చేష్టాదికారములందు బ్రహ్మభావనకల్గి చరించుట.

అధిష్ఠానములందు అనగా దేవతామూర్తులు, చిత్రములు, కలశములు, యంత్రములు మొదలగు వాటియందు ఆయా దేవతలయొక్క గుణముల



నారోపించి జేయబడు ఉపాసన మనబడుచున్నది. మనోబుద్ధి చిత్తాహంకారములన్నియు దేవతా ప్రతిరూపములుగా భావించి వాటివల్ల జనించు గుణధర్మములకు వశుడుగాక తానే పరబ్రహ్మగా దేవతా స్వరూపభావనతో ఆత్మను వశముగావించుకొని యుండుటయే ఆరోపోపాసన యందలి అంతరుపాసనకాగలదు.

శ్లో॥ క్రియా యోగేన చోపాసా విధి స్సంవర్గ ఉచ్చతే ।
సంవర్తవాయః ప్రళయే భూతాన్యేకోఽవ సీదతి ॥

శ్లో॥ ఆరోపోబుద్ధి పూర్వేణ య ఉపాసా విధిశ్చసః ।
యోషిత్యగ్ని మతి యత్తదధ్యాస స్స ఉదాహృతః ॥

అష్టాంగలక్షణ లక్షితమైన క్రియాయోగముద్వారా ప్రాణవాయువును సంవర్గవాయువుతో లయమొనర్చుటయే సంవర్గోపాసనగా దెలుపబడినది. దేనియందైనను బుద్ధిపూర్వకముగా దేవతాభావము నారోపించుటయే అధ్యాసోపాసనా లక్షణము. ఇందు ఆరోపాసనయే కర్మాంగమై యున్నది. ఈ కర్మకూడా బాహ్యకర్మ, అంతరకర్మ యని రెండు విధములు.

అహంగ్రహోపాసనకూడా సగుణము-నిర్గుణము అని రెండు విధములుగా దెలుపబడినది. నిర్గుణాహంగ్రహోపాసన యనునది లయ యోగమునకు సంబంధించి బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి పునరావృత్తరహిత బ్రహ్మ సాయుజ్యప్రాప్తి కుపకరించగలదు. సగుణాహంగ్రహోపాసన తిరిగి బాహ్యాంతర భేదములతో రెండు విధములుగా నున్నది. సూర్యమండల చంద్రమండల లాంతరములయందు దేవతను భావనజేసి లేక శ్రేత స్మార్తాగ్నులయందు దేవతను భావనమొనర్చి ఉపాసించునది బాహ్యాస గుణాహంగ్రహోపాసనము, మూలధారస్థితి యగు కుండలినీ దివ్యశక్తిని దేహాంతర్గత షట్చక్రములందు భావనారూపముగా నుపాసింపుచు తత్త్వాతీతమైన పరమాత్మ భావనజెందుట నిర్గుణాహంగ్రహోపాసన లక్షణము. ఇట్టి ఉసాసనాభేదములు-వాటికుపాంగములు నెన్నియో గలవు. ముఖ్యముగా-

శ్లో॥ తంత్రాణాం బహురూపత్వాత్కర్తవ్యం గురు సమ్మతమ్ ॥

అని జెప్పియుండుటచే బహురూపముగల తంత్రశాస్త్రములను పరిశీలింపుడు ఆచరణయోగ్యమగు ఉపాసనాక్రమమేదియో గ్రహించ

లేకుండుటకంటె జ్ఞానప్రదుడై దీక్షనొసంగిన గురువు జెప్పిన విధము
మంత్రము నుపాసించుట యుక్తము.

## మంత్రానుష్ఠానక్రమము

శ్లో॥ **శుద్ధిం చతుర్విధం ప్రోక్తం సర్వకాలేషు సర్వదా ।**
**శరీరం మనసశ్చైవ దిశాయాంస్థాస మేవచ ॥**

మంత్రానుష్ఠానపరులు సర్వదా నాల్గు విధములైన శుద్ధులు క
యుండవలెను. 1. శారీరకశుద్ధి 2. మానసికశుద్ధి 3. స్థానశుద్ధి 4. దిశాశు
యనునవి ముఖ్యములు. ఈ నాల్గు విధములైన శుద్ధత్వము ప్రాప్తించని
జనసిద్ధి కల్గుట దుర్లభము.

**1. శరీరశుద్ధి :-**

శ్లో॥ **మలనిర్మోచనం స్నాన మాయుష్యం బలవర్ధనమ్ ।**
**త్రికాలం విధినాస్నానం వైదికోమం మంత్రనిత్తమః ॥**

శరీరమునకు సంభవించు కులములను దొలగించునది స్నానము
ఆయుర్బలాభివృద్ధి నొనర్చుటకు సహకరించునదైన ఈ స్నానమును వైదికు
మంత్రవేత్తయునగువాడు ప్రతిదినము మూడుకాలములందు వి
పూర్వకముగా శిరఃస్నానము గావించి శరీరశుద్ధి నందవలెను.

**2. మనశ్శుద్ధి :-**

కామక్రోధ లోభ మోహ మదమాత్సర్య - అహంకార మమకారము
నునవి మనస్సును మలిన పరచగలవు. అట్టి మలిన కారణములను
ప్రయత్నపూర్వకముగా తొలగించుకొని అవిరోధ, ధీరత్వ, దయా, క్షమాది
గుణములతో మనస్సును నిర్మలము గావింపుకొని చుండుటయే మనశ్శుద్ధి

శ్లో॥ **కరౌ కలికృతాన్ దోషాన్ ద్రవ్య దేహాత్మ సంభవాన్ ।**
**సర్వం హరతి చిత్తస్థో భగవాన్ దేవకీ సుతః ॥**

శ్లో॥ **సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శినః ॥**



అను విధముగా అన్ని భూతములందు (జీవులయందు) తనను తనయందన్ని జీవరాశులు నున్నట్లు భావింపుచు సమదృష్టి నలవరచుకొని నిరంతర నారాయణ స్మరణ గావింపుచున్న మనశుద్ధి చేకూరుట నిశ్చయము.

**3. దిశాశుద్ధి :** -

శ్లో॥ **యత్రదిఙ్నియమోనాస్తి జపయజ్ఞాది కర్మసు ।**
**తిస్రస్తత్రదిశం ప్రోక్తా ఐంద్రీసౌమ్యాఽపరాజితా ॥**

శ్రుతి॥ **త ఉదీచ్యాం ప్రాత్యాం దిశ్యయతంత తే**
**తతో నపరాజయ స్తస్తేషా దిగపరాజితే ॥**

జపయజ్ఞాది కర్మలయందు విధిపూర్వకమైన దిశానిర్ణయము లేనప్పుడు తూర్పు, ఉత్తర, ఈశాన్య దిశలు శ్రేష్ఠములుగా దెలుపబడినవి, జప మొనర్చుట కనువగు ప్రదేశమునందు తూర్పుదిశలో ఉదఙ్ముఖముగా గానీ, ఉత్తరదిశలో ప్రాఙ్ముఖముగాగానీ, ఈశాన్యదిశలో ప్రాగుదఙ్ముఖ ములుగాగానీ కూర్చుని అనుష్ఠానములు నిర్వర్తించుట శ్రేయస్కరము. ఇది దిశాశుద్ధి యనబడును.

**4. స్థానశుద్ధి :-**

జపమొనరించుస్థానము పవిత్రమైయుండుట చాలా ముఖ్యము.

శ్లో॥ **అథ మంత్ర జపస్థానం కథయామి వరాననే ।**
**సాగరాంతే సరిత్తీరే తీర్థే హరిహరాలయే ॥**
**శక్తి దేవాలయే గోష్ఠే పర్వతాగ్రే గుహాంతికే ।**
**వటస్య ధాత్ర్యామాలే శ్రీవృక్షే బృందావనే తథా ॥**
**పవిత్రే నిర్మలేదేశే జపానుష్ఠానతోపివా ।**
**నిర్వేదనేనే మేనేన జపం కుర్వంతి సిద్ధిదమ్ ॥**

సముద్ర, నదీతీరములు, తీర్థరాజములుగల తావులు, హరి-హర, శక్త్యాలయములు, గోశాలలు, మర్రి, ఉసిరిగ, బిల్వవృక్షములవద్ద, తులసి వనమునందు గురుసన్నిధానము, విప్రగృహము, పర్వతాగ్రము, గుహాంతరము, మహారణ్యము, తనయొక్క స్వగృహమునందలి ప్రత్యేక విభాగముల (పరగృహము నిషేధము) మంత్రానుష్ఠానము గావించుటకు పవిత్రములైన స్థానశుద్ధి జేకూర్చగలవు.

జపస్థానమును ప్రతిదినము గోమయముచే నలకి ముగ్గులు తీర్చవలెను. పూజామంటపము ప్రత్యేకముగా నియమింపబడీ అందు (మధ్యలో) చక్కని ఉన్నత పీఠము నేర్పాటు గావించి ప్రధాన దేవతలను లేక పంచాయతన సంపుటిని నెలకొల్పవలెను. పూజాపీఠమునకంటె అధికోన్నతముగల ఆసనముపై తాను కూర్చొనరాదు.

## కూర్మచక్రలేఖనమ్

శ్లో॥ షట్కోణం విలిఖే చ్చక్రం ముఖేహ్రీంకారమేవచ ।
పృష్ఠే మన్మథ బీజం చ చతుష్కోణే షుతారకం ।
అష్టవర్గ అష్టపత్రం కూర్మచక్రం విధీయతే ।
మధ్యే హుంఫట్ స్వాహేతి జపకోటిగుణం భవేత్ ॥

పవిత్రమైన జపస్థానమందు తాను కూర్చును స్థానమున కూర్మచక్రమును లిఖించుకొని దానిపై ఆసనాదులు కల్పించి వాటిపై కూర్చుని జపించుట మంత్రశాస్త్ర నియమము. ముందుగా షట్కోణమును లిఖించి దానియొక్క ముఖభాగమునందు హ్రీంకారమును-పృష్ఠభాగమునందు క్లీం అను బీజాక్షరమును, పార్శ్వకోణములు నాలుగిటియందు రాం అను బీజాక్షరములను లిఖించవలెను. దానిపై వర్తుల రేఖనుంచి ఎనిమిది దళముల నేర్పరుచవలెను ఆ ఎనిమిది దళములయందు ప్రాగాదిగా ప్రతిదళమందు రెండేసి వంతున షోడశమాత్రుకలను (సర్వములను) నెలకొల్పి దిక్స్థానములందు అష్టవర్గాక్షరములైన అ,క,చ,ట,త,ప,య,శ అను ఎనిమిదక్షరములు బిందు సహితముగా ప్రాగాది అష్టదిక్కులందు లిఖించి, షట్కోణ మధ్యభాగమునందు "హుం ఫట్ స్వాహా" యను పల్లవమును లిఖించిన యెడల అది కూర్మచక్రము కాగలదు. కూర్మచక్రముపై గూర్చుని జపము గావించిన ఆజపము కోటిరెట్లధికఫల మొసంగగలదు.



## ఆసన నిర్ణయమ్

శ్లో॥ కూర్మచక్రంలిఖే ద్భూమే దారుపీఠం ప్రకల్పయేత్ ।
కుశైరజిన మాస్తీర్య కంబళిం చాజనాంతరే ।
తస్యోపరి పటంచైవ యజేద్దేవం పద్మాసనే ॥

గోమయముచే అలికిన భూమిపై కూర్మచక్రమును లిఖించి దానిపై పీటవేసి- ఆ పీటపైని కుశాసనమునుంచి దానిపై జింకచర్మమువేసి దానిమీద కంబళివేసి (చిత్రాసనము) చివరగా నొంశుద్ధ వస్త్రమును బరచినట్టి ఉత్తమాసనమునందు పద్మాసనము వైచుకొని కూర్చుని జపతప పూజాదిదేవతా కర్మలు నిర్వహించవలెను. "స్థిరసుఖమాసనమ్" యనుపతంజలి సూత్రప్రకారము ఆసనము స్థిరముగాను, సుఖముగాను నుండవలెను.

శ్లో॥ ఆసనం విజయం యేన జితంతేన జగత్త్రయమ్ ॥

అటునిటు కదలకుండా ఆసనమునందు స్థిరముగా కూర్చునగల్గి ఆసన సిద్ధిని జయించినవానికి మూడులోకములను జయించుశక్తి కలుగ గలదు. అనగా ఒక ఆసనముపై కూర్చునిన పిదప ప్రారంభింపబడిన కర్మ ఆసాంతము పూర్తియగువరకు ఆ ఆసనమునుండి కదలరాదు.

శ్లో॥ ఏకం సిద్ధాసనం ప్రోక్తం ద్వితీయం కమలాసనమ్ ।
స్వస్తికం జపయోగే చ ప్రోక్తం వై ఋషి సమ్మతమ్ ॥

వైదికపరమగు కర్మలన్నిటియందు సిద్ధాసన, పద్మాసనములు విశిష్ఠ యోగ్య ప్రదములుగా దెలుపబడినవి. జప, ధ్యానములం దీ రెండాసనములతో బాటు స్వస్తికాసనముగూడా యోగ్యమని శాస్త్రవచనము.

శ్లో॥ జనూర్వోరంతరే సమ్య క్కృత్వా పాదతలే ఉభే ।
ఋజుకాయః సమాసీనః సస్తికం తత్ప్ర చ క్షతే ॥

మోకాళ్ళకు, తొడలకు మధ్య రెండుపాదములు జొనిపి, శరీరమును వంగకుండా చక్కగా నిక్కించి యుండినది స్వస్తికాసనము.

## జప భేదములు

శ్లో॥ వాచికోపాం శుకేచైత మానసం చ త్రిషు స్మృతా।
త్రివిధం జపకర్మాణి హీసమధ్యోత్తమా మతాః ॥

భావనారూపముగా మనస్సుచే నాచరించు జపము ఉత్తమమైనది. శబ్దము వినిపించకుండా పెదవులు కదల్చుచు చేయు ఉపాంశుజపము మధ్యమమైనది, అందరికీ వినిపించు విధముగా మంత్రము నుచ్చరించుజేయు వాచికజపము అధమమైనది అని జపభేదములు మూడు విధములుగా దెలుపబడినవి.

## జపమాలా లక్షణమ్

శ్లో॥ త్రివిధం జపమాలాని కరమాలా చ వైదికం ।
వర్ణమాలా సిద్ధిశ్శీఘ్రం మణిమాలా చ కామికమ్ ॥

మంత్రానుష్ఠాన మొనర్చుటకు జపమాల చాలాముఖ్యము. ఈ మాల మూడు విధములుగా దెలుపబడినది 1. కరమాల 2. వర్ణమాల 3. మణిమాల. ఇందు కరమాల వైదికస్థిరమై వేద ఋక్పారాయణల యందు, గాయత్రీ మంత్రజపమునందు ప్రాధాన్యత కల్గియున్నది. ఆకారాదిక్షకారాంత వర్ణములుగలది వర్ణమాల, యిది జపితకు శీఘ్రసిద్ధి నొసంగ గలదు. మణిమాల యనగా రత్నములు, మణులు, రుద్రాక్షాదులచే ఏర్పడిన మాల. ఈ మాల అన్ని కోర్కెలను ఫలింపజేయగలదు.

శ్లో॥ అనామికాది ద్వయం పర్వ కనిష్ఠాది క్రమేణ చ ।
తర్జనీ మూలపర్వంతం కరమాలా ప్రకీర్తితా ॥

మధ్యమాదిద్వయం పర్వం జపకాలేదు వర్జయేత్ ।
తం వై మేరు విజానీయా త్కథితం బ్రహ్మణాపురా ॥

అంగుళ్యగ్రేషు యజ్జప్తం యజప్తం మేరులాఘనే ।
అసంఖ్యాతంతు యజ్జప్తం తత్సర్వం నిష్ఫలంభవేత్ ॥



దక్షిణహస్తము నందలి అనామికయొక్క మధ్యపర్వము (కరువు) నుండి ప్రారంభించి దానిఅడుగు పర్వము కనిష్ఠికయొక్క ఆది మధ్యాంత పర్వములు అనామికాగ్రపర్వము, మధ్యమాగ్రపర్వము, తర్జనీ అగ్రమధ్య మూలపర్వములు కలిపి పదిపర్వములతో గూడినది కరమాల. మధ్యమ వ్రేలియొక్క మూల మధ్యమ పర్వములు ఈ మాలకు మేరువుగా దెలుపబడినవి. కావున వీటిని స్పృశింపకూడదు. వ్రేళ్ళు చివరిభాగములందు జపించినను, మేరువును దాటి జపించినను, లెక్కింపకుండా జపించినను ఆ జపము నిష్ఫలము కాగలదు. కరమాలయందు వ్రేళ్ళు అన్నియు ఒకదాని కొకటికలిపి యుండవలెను.

శ్లో॥ పంచశ దక్షరాణ్య త్రానులోమ ప్రతిలోమతః ।
ఇత్యేసం స్థాపయేత్ స్పష్టం న కస్మైచి త్ప్రదర్శయేత్ ॥
అనులోమ విలోమార్ణైర్మాతృకాయాః స బిందువై : ।
సమేరువైః సాష్టవర్గైర్మాలాస్యా ద్యోగినా శుభా ॥

ఆకారాదిగాగల షోడశ స్వరములు క్షకారమును మినహాయించి కకారాది వ్యంజనములుగలసి మొత్తం యాబది అక్షరములగుచున్నవి. వీనినే వర్ణములు, మాతృకలు యనియెదరు. ప్రణవ సహితముగాను బిందుయుక్తము గాను ఈ వర్ణములలో నొక్కొక్కదానిని స్మరించి పిదప మంత్రము నుచ్చరింపుచు క్షకారమును మేరువుగా భావించి తిరిగి విలోమ క్రమములో ళకారాది అకారాంతము పూర్వమువలె మంత్రమును జపించి చివరగా అష్టవర్గాక్షరములతో జపించిన యెడల నూటఎనిమిది సంఖ్యకాగలదు. దీనిని వర్ణమాలగా శాస్త్రములు దెల్పినవి.

శ్లో॥ వర్ణైర్విన్యస్తయా యస్తు క్రియతే మాలయాజపః ।
ఏకవారేణతస్యైవ పురశ్చ ర్యాకృతాభవేత్ ॥
మాతృకాదియుతం మంత్రం ద్వాదశాబ్దం తుయో జయేత్ ।
క్రమేణ లభతే జ్ఞాన మణిమాది గుణాన్వితమ్ ॥

పైన దెల్పిన విధముగా వర్ణమాలచే (108 పర్యాయములు) ఒక్క మారు జపించుటవల్లనే పురశ్చర్య గావించిన ఫలము ప్రాప్తించగలదు. అదేవిధముగా వర్ణమాలతో పండ్రెండు సంవత్సరములు మహామంత్రమును జపించిన యెడల క్రమముగా బ్రహ్మతత్త్వజ్ఞానసిద్ధి గలిగి, అణిమాద్యష్ట సిద్ధులయొక్క రహస్యజ్ఞాన మొసగూడగలదు.

శ్లో॥ రుద్రాక్ష శంఖ పద్మాక్ష పుత్రజీవక మౌక్తికైః ।
స్ఫాటికైర్మణిభీరత్నైః సైవర్ణై ర్విద్రుమై స్తథా ॥
కుశైః పర్వై ర్ద్వాదశ స్యుర్గృహస్థస్యా క్షమాలికాః ॥

రుద్రాక్షలు, శంఖములు, తామరపూసలు, పుత్రజీవిగింజలు, ముత్యములు, పగడములు, స్ఫటికములు మణులు, రత్నములు, సువర్ణపూసలు దర్భముడులు అను పదిరెండును గృహస్థాశ్రమ వాసులకు జపమాల యందు గూర్చుకొనుటకు కుత్తమమైనవి.

శ్లో॥ అంగులీ గణనాదేకం రేఖయాష్టగుణం భవేత్ ।
పుత్రజీవైర్దగుణం శతం ఖం ఖైః సహస్రకమ్ ॥

ప్రవాళైర్మణిరత్నైశ్చ దశసాహస్రకం స్మృతమ్ ।
తదేవ స్ఫాటికైః ప్రోక్తం మౌక్తికైర్లక్ష ముచ్యతే ॥

పద్మాక్షైర్దశలక్షం స్యా చ్ఛేవర్ణైః కోటిరుచ్యతే ।
కుచగ్రం థ్యాకోటిశతం రుద్రాక్షాః స్యా ద్యంతకమ్ ॥

తులసీకాష్ఠ ఘటితైః మచిభిర్జపమాలికా ।
సర్వకర్మాణి సర్వేషా మీప్సితార్థ ఫలప్రదా ॥

జప మొనర్చునప్పుడు వ్రేళ్ళతో లెక్కించుట సామాన్యఫలము. వ్రేళ్ళ రేఖలపై లెక్కించుట ఎనిమిదిరెట్లు అధికఫలము. పుత్రజీవిగింజలమలచే లెక్కించన పదిరెట్లు, శంఖమాల నూరురెట్లు, పగడములు మణులు, రత్నముల మాలలు వేయిరెట్లు, స్ఫటికమాల పదివేలరెట్లు, ముత్యములమాల లక్షరెట్లు. తామరపూసలమాల పదిలక్షలరెట్లు, బంగారుపూసలమాల కోటిరెట్లు. దర్భముడులమాల నూరుకోట్లరెట్లు అధికఫల మొసంగ గలవు. రుద్రాక్షమాల అనంతమగు ఫలమొసంగగలదు. తులసీకాష్ఠములచే చేయబడినమాల అన్ని కర్మలయందు సమస్త కోరికల నివ్వగలదు.

శ్లో॥ అష్టోత్తర శతమాలా తత్రస్యాదుత్తమోత్తమా ।
శతసంఖ్యోత్తమా మాలా పంచాశన్మధ్యమా మతా ॥
చతుః పంచాశతో యద్వా అథమా సప్తవింశతిః ॥



మాలగా నేర్పరచు పూసలు మొదలగునవి నూటఎనిమిది కల్గి యుండుట ఉత్తమోత్తమము-నూరుగానుండుట ఉత్తమము. యాబదినాల్గు గానీ, యాబదిగానీ యుండుట మధ్యమము. ఇరువదేడుగా నుండుట అధమము.

శ్లో॥ స్ఫటికం జ్ఞానదం చైవ ప్రవాళం రోగనాశనం ।
తులసీమోక్షదశ్చైవ పద్మమైశ్వర్య వర్ధనమ్ ॥
హేమజం మంత్రసిద్ధిశ్చ రాజితం భోగవృద్ధిదం ।
మౌక్తికం కీర్తి వృద్ధిశ్చ రుద్రాక్ష స్సర్వ సాధనమ్ ॥

స్ఫటికమాల జ్ఞానవృద్ధిని గావింపగలదు. పగడములమాల రోగములను నిర్మూలించును. తులసీమాల మోక్షప్రదమైనది, పద్మబీజమాల ఐశ్వర్యహేతు, బంగారుపూసలమాల మంత్రసిద్ధి నొనగూర్చును, వెండి పూసలమాల భోగముల నభివృద్ధి గావించగలదు, ముత్యాలమాల కీర్తినొసంగుటలో గొప్పది, రుద్రాక్షమాల సర్వార్థసాధన కుపయుక్తము.

శ్లో॥ సప్తవింశతి రుద్రాక్షమాలయా దేహసంస్థయా ।
యత్కరోతినరః పుణ్యం సర్వం కోటి గుణంభవేత్ ॥

ఇరువదేడు రుద్రాక్షలతో గూర్చిన మాలను దేహమునందు ధరించిన నరుడు ఏ ఏ పుణ్యకర్మల నాచరించినను అవియెల్లను కోటిరెట్లు అధికఫలవంతములు కాగలవు.

శ్లో॥ రుద్రాక్షాః కంఠదేశే ధారయిత్వా మనీషిభిః ।
నవక్తుం తత్పుణ్యఫలం బ్రహ్మాద్యాద్యమరారయః ॥

రుద్రాక్షమాల నెల్లవేళయందు కంఠమున ధరించి యుండువాడు సాక్షాన్మహేశ్వర స్వరూపుడుగా దెలుపబడినాడు. అతని పుణ్యఫల మిట్టిదని జెప్పుటకు బ్రహ్మాదిదేవతలుకూడా సమర్థులుకారు.

## మంత్ర స్వరూపము

**"మననాత్ త్రాయతేయస్మాత్ మంత్రమిత్యభిధీయతే"**

మంత్రమనునది నిర్గుణ బ్రహ్మస్వరూపము. ఒక బీజము (గింజ వృక్షమైనట్లుగా నిర్గుణబ్రహ్మము - మంత్రముగా నభివ్యక్తమైనది, ఇది సంకల మాత్రముచే మనః ప్రేరితమైన వాయువుయొక్క ఆఘాతముచే కంఠము నాలుక, పెదవులద్వారా బహిర్గతమై మంత్రముగా రూపొందబడుచున్నది

**శ్లో॥ తన్మంత్రదేవతాదర్శ ప్రాప్త తత్సామరస్యకమ్ ।**
**ఆరాధకస్య చిత్తం చ మంత్రస్త ధర్మ యోగతః ॥**

చిత్తము నందలి సంకల్పమే మంత్రము. నిర్గుణ బ్రహ్మమే త ఆత్మతత్త్వమని విమర్శించునది చిత్తము. దీనినే మంత్రమని భావ జేయవలెను.

**శ్లో॥ అన్యచో క్తస్య మంత్రస్య మననత్రాణ ధర్మిణః ।**
**ఉక్తమంత్రాను సంధానాకష్టంభోస్య తదాత్మకః ॥**

మంత్రమునకు సర్వమును రక్షించు గుణము సతఃసిద్ధము అ మంత్రమును మననము చేయుటవలన తదాత్మకుడు కాగలడు. అప్పు మంత్రమునకు-చిత్తమునకు అభేద మేర్పడగలదు.

**శ్లో॥ విద్యేతి పరమాద్వైత సంప్రవేదన రూపిణీ ।**
**శరీరం యస్య భగవాన్ శబ్దరాశిః స ఉచ్యతే ॥**

**తస్య సత్తా సమస్తాధ్వ పూర్ణాహంతా స్వరూపిణీ ।**
**స్ఫురత్తా సైవ మంత్రాణాం మననత్రాణ ధర్మిణామ్ ॥**

నిర్గుణ పరబ్రహ్మమును చక్కగా తెలియజేయు రూపమును-లేక శక్తి విద్యయని యందురు. మాతృకారూపమైన శబ్దరాశి ఈ శక్తికి శరీరమ వంటిది ఈ శబ్దరాశియొక్క విశేష విశ్వాభేదమైన (విమర్శాత్మకముగా స్ఫురణయే మంత్రము. ఈ మంత్ర వీర్యశక్తివలన మనన, త్రాణ ధర్మము ఆ మంత్రమునకు కల్గుచున్నవి. గుప్తార్థముతో ఆవిర్భవించుటవ



మంత్రమును "రహస్యము" అనియు నందురు. మరియు అపూర్వామోద సుభగము. పరామృత రసోల్బణము నైనది మంత్రమని దెలియవలెను.

కంఠతాలు ఓష్ఠాదులద్వారా వెలువడిన శబ్దము-చిత్త వృత్తి రహిత మైన ఏకాగ్రధ్యానమువలన స్పందించగలదు. ఆ స్పందనము తీవ్రరూపము ధరించుకొలది బాహ్యస్థౌల్యముగల శబ్దముగా భాసించి మంత్రమగు చున్నది. ఈ దశలో నిర్గుణబ్రహ్మము సగుణ బ్రహ్మముగామారి మంత్రాది దేవతారూపమున సాధకుని కభీష్టముల నొసంగును. అట్టి మంత్ర దేవతను, ఆమంత్రము నుపదేశించిన గురువునకు నేమాత్రమును భేదములేదు.

**శ్లో॥ యథాఘటశ్చ కలశః కుంభశ్చైకార్థ వాచకాః ।**
**తథా మంత్రో దేవతా చి గురుశ్చైకార్థ వాచకాః ॥**

ఘటము, కలశము, కుంభము అనునవెట్లు ఏకార్థమును కల్గియున్నవో అదేవిధముగా మంత్రము-దేవతా-గురువు అనునవికూడా ఏకార్థవాచకములని గ్రహించవలెను.

**శ్లో॥ యథాదేవీ తథా మంత్రే యథా మంత్రే తథా గురౌ ।**
**యథాగురౌ తథా స్వాత్మ న్యేవం భక్తిక్రమః స్మృతః ॥**

దేవతయందెట్టి బుద్ధియో మంత్రమునందట్టి బుద్ధియు మంత్రము నందెట్టి బుద్ధియో గురువునందట్టి బుద్ధియు, గురువునందెట్టి బుద్ధియో తన ఆత్మయం దట్టి బుద్ధియు కలిగియుండుటయే భక్తియని చెప్పబడెను. ఇట్టి భక్తిగలవానికే మంత్రము ఉపయోగించగలదు.

## మంత్ర సంస్కారములు

గురుదేవుని యాశ్రయించి వారి కృపాకటాక్షమువలన మంత్రోప దేశమునంది దీక్షను స్వీకరించిన సాధకుడు నియతవ్రతుడై మంత్రమును పునశ్చరణ గావించవలెను. తానుపదేశమునందిన మంత్రమునకు సంస్కారముల నొనర్చి జపించుటవల్ల శీఘ్రముగా దేవతానుగ్రహము కల్గి త్వరిత ఫలసిద్ధి ప్రాప్తించగలదు.

**శ్లో॥ దోషానిమానవిజ్ఞాయ యోమంత్రాన్ భజతేజడః ।**
**సిద్ధిర్నజాయతే తస్య కల్పకోటి శతైరః ॥**

మంత్రమునకు సహజముగా ప్రాప్తించు దోషములు మంత్ర సంస్కారమువలన తొలగిపోగలవు. అట్టి దోషములను గుర్తెరుంగక (సంస్కారములు జరుపక) అజ్ఞానియై సాధకుడు మంత్ర పునశ్చరణము (జపించిన) గావించిన యెడల ఆ మంత్ర మెంతకాలమునకు సిద్ధింపనేరదు.

శ్లో॥ జననం జీవనం పశ్చాత్తాడనం బోధనం తథా ।
అథాభిషేకో విమలీ కరణా ప్యాయనే పునః ॥
తర్పణం దీపనం గుప్తిర్దశైతా మంత్ర సంస్క్రియాః ॥

జననము, జీవనము, తాడనము, బోధనము, అభిషేకము, విమలీకరణము, అప్యాయనము, తర్పణము, దీపనము, గోపనము అనునవి మంత్రమునకు చేయదగిన దశవిధ సంస్కారములు. ఈ సంస్కారములు కర్మపరముగాను, కేవలమంత్ర పరముగాను జేయదగియున్నవి. ముఖ్యముగా కామ్యఫలాపేక్షితులైనవారు కర్మ పరసంస్కారములను, మోక్షాపేక్ష గలవారు మంత్రపరమైన సంస్కారములను, జరుపుట సాంప్రదాయమై యున్నది.

**1. జనన సంస్కారము:-**

శ్లో॥ మంత్రాణాం మాతృకామాధ్యా దురారో జననం స్మృతమ్ ॥

మంత్రమును మాతృకా మధ్యమునుండి యుద్ధరించుటయే జనన సంస్కారక్రియ అనగా గోరోచన, కుంకుమ, చందనములచే చేయబడిన కల్కముతో రావి లేక తామర పత్రమునందు అకారము మొదలుకొని క్షకారాంతము వరకుగల మాతృకలను లిఖించి ఆమాతృకాపత్రమును తూర్పుముఖముగా నుంచి ప్రాణప్రతిష్ఠ గావించి యథాశక్తిగా పూజించి గురు, దేవతా నమస్కారముల నొనర్చి, ఆ వర్ణములనుండి తన మంత్రము నందలి అక్షరములను వేరొకపత్రముపై వ్రాయవలెను. తిరిగి మంత్రవర్ణము లను పూజించి- ఉద్వాసనముజెప్పి శుద్ధ జలములందు వదలవలెను. దీనినే మంత్రజనన సంస్కారమందురు. కర్మ పరముకూడా ఈ విధముగానే సంస్కరించవలెను. (ఈ సంస్కారపద్ధతులందు సాంప్రదాయ - శాస్త్రభేదము లున్నవి) మాతృకలనుండి తమ మంత్రము నుద్ధరించు నప్పుడు స్వర-వ్యంజన భేదమును పాటించవలెను. (ఉదాహరణ: హ్రీం-క్లీం అనునది మంత్రము దానిని హ-ర-ఈ-మ-క-ల-ఈ-మ అను విధముగా అక్షరములను విడిగా పత్రముపై వ్రాసుకొనవలెను.)



**2. జీవన సంస్కారము :-**

శ్లో॥ ప్రణవాంతరితాన్ కృత్వా మంత్ర వర్ణాన్ జపేత్సుధీః ।
ఏతజ్జీవన మిత్యాహు ర్మంత్ర తంత్ర విశారదాః ॥

మంత్రమును ప్రత్యక్షర ప్రణవయుక్తము గావించి 1008 పర్యాయములు జపించవలెను.

**కర్మపరము :-** "ఓం గం ఓం గ ఓం ణ ఓం ప ఓం త ఓం యే ఓం న ఓం మః ఓం" ఈ ప్రకారం తమ మంత్రమునకు ప్రణవ సంధానము గావించి జపించవలెను.

**మంత్రపరము :-** "స్వధావషట్ ఓం గం గణ పతయే నమః వషట్ స్వధా"

ఈవిధముగా 1008 పర్యాయములు జపించిన యెడల జీవన సంస్కారము కాగలదు.

**3. తాడన సంస్కారము :-**

శ్లో॥ మంత్రవర్ణాన్ నమాలిఖ్య తాడయే చ్చందనాంభసా ।
ప్రత్యేకం వారిణా మంత్రీ తాడనం తదాహృతమ్ ॥

**కర్మపరము :-** మంత్రమునందలి యక్షరముల నన్నిటినీ పత్రము లేక ఫలకముపై వ్రాసి చందనము గలిపిన చిక్కని నీటిచే ఆ వ్రాసిన అక్షరములను కొట్టవలెను. ఆసమయమునందు గురు, దేవతను స్మరింపు చుండవలెను.

**మంత్రపరము :-** "ఫట్ గంగణ పతయే నమః ఫట్"

ఈవిధముగా తమ మంత్రమున కాద్యంతములందు ఫట్ సంపుట గావించి 1008 పర్యాయములు జపించిన యెడల తాడవ సంస్కారము కాగలదు.

**4, బోధన సంస్కారము :-**

శ్లో॥ విలిఖ్య మంత్రం తన్మంత్రీ ప్రసూనైః కరవీర జైః ।
తన్మంత్రాక్షర సంఖ్యాతై ర్హన్యాద్ధా తేన బోధనమ్ ॥

**కర్మపరము :-** తమయొక్క అనుష్ఠాన మంత్రమును పత్ర లేక ఫలముపై వ్రాసి ఆ మంత్రమునం దెన్ని అక్షరములున్నవో అన్ని కరవీర పుష్పములచే (గన్నేరుపూలు) గొట్టవలెను.

**మంత్రపరము:-** "హ్రూం గం గణ పతయే నమః హ్రూం"

పై విధముగా తమ మంత్రమునకు హ్రూం బీజమును సంపుటి గావించి 5000 పర్యాయములు జపించుటవల్ల మంత్రమునకు బోధన సంస్కారము కాగలదు.

**5. అభిషేకము :-**

**శ్లో॥ స్వతంత్రోక్త విధానేన మంత్రీ మంత్రార్థ సంఖ్యయా ।**
**అశ్వత్థ పల్లవై ర్మంత్ర మభిషిచే ద్విశుద్ధయే ॥**

**కర్మపరము :-** పూర్వమువలె మంత్రాక్షరముల నన్నిటినీ లిఖించి తమయొక్క సాంప్రదాయాను సారముగా అభిషేకించవలెను.

**మంత్రపరము:-** మంత్రాక్షరములను లిఖించి "ఓం హం సః ఓం" అను మంత్రముచే 1008 పర్యాయములు అభిమంత్రించి పిమ్మట రావి చిగుళ్ళతో శుద్ధ జలములచే అభిషేకించిన యెడల మంత్రమునకు అభిషేక సంస్కారము కాగలదు.

**6. విమలీకరణము :-**

**శ్లో॥ సంచిత్య మనసామంత్రం జ్యోతిర్మంత్రేణ నిర్దహేత్ ।**
**మంత్రే మలత్రయం మంత్రీ విమలీకరణం త్విదమ్ ॥**

**కర్మపరము:-** జ్యోతిర్మంత్రముతో సంపుటి గావించిన మూలమంత్రమును మనస్సుతో 1008 పర్యాయములు జపించుటవల్ల మంత్రమునకు గల మలత్రయములు దహించబడగలవు.

**మంత్రపరము:-** "ఓం త్రోం వషట్ ఓం గం గణపతయే నమః వషట్ త్రోం ఓం" తమ మంత్రమునకు పైవిధమగు సంపుటి గావించి 1008 పర్యాయములు జపించుటవల్ల మంత్రమునకు విమలీకరణ సంస్కారము కాగలదు.



**7. ఆప్యాయన సంస్కారము :-**

**శ్లో॥ తార వ్యోమాగ్ని మనుయుగ్దండీ జ్యోతిర్మనుర్మతః ।**
**కుశోదకేన జప్తేస ప్రత్యర్ణం ప్రోక్షణం మనోః**
**తేనమంత్రేణ విధివదేత దాప్యాయనం స్మృతమ్ ॥**

**కర్మపరము:-** పత్ర ఫలకాదులయందు వ్రాసిన మంత్రాక్షరములను కుశోదకములచే ప్రోక్షింపుచు "ఓం హం రం" అను బీజాక్షరములను 108 పర్యాయములు జపించిన యెడల ఆప్యాయన సంస్క్రియకాగలదు.

**మంత్రపరము:-** ఓం హ్రీం ఓం గం గణపతయే నమః హ్రీం ఓం

పైవిధముగా హ్రీం బీజమును తమ మంత్రమునకు సంపుటి గావించి 1008 పర్యాయములు జపించవలెను.

**8. తర్పణసంస్కారము :-**

**శ్లో॥ మంత్రేణ వారిణా తత్ర తర్పణమ్ తర్పణమ్ స్మృతిమ్ ॥**

**కర్మపరము:-** మూలమంత్రమును బలుకుచు 1008 పర్యాయములు దేవతీర్థముగా తర్పణమొనర్చుట (నీరు విడచుట) తర్పణ సంస్కార మనబడును.

**మంత్రపరము:-** "ఓం గం గణపతయేనమః తర్పయామి"

శుద్ధజలము, ఆవుపాలు, ఆవునెయ్యి కలిపి పైవిధముగా దేవతీర్థరీత్యా తర్పణ గావింపుచు పై విధముగా తమ మూలమంత్రమును 1008 పర్యాయములుచ్చరించవలెను.

**9. దీపన సంస్కారము :-**

**శ్లో॥ తరామాయా రమా యోగో మనోర్దీప న ముచ్యతే ॥**

**కర్మపరము:-** మూలమంత్రమున కాద్యంతములందు ఓం హ్రీం శ్రీం అను బీజములను సంధించి 1008 పర్యాయములు జపించవలెను)

(ఉదాహరణ: ఓం హ్రీం శ్రీం గం గణపతయే నమః శ్రీం హ్రీం ఓం)

**మంత్రపరము:-** "హం సః ఓం గం గణపతయే నమః సోఽహమ్"

పైవిధముగా తమ మంత్రమును 1008 పర్యాయములు జపించిన యెడల దీపన సంస్కారము కాగలదు.

**10. గోపన సంస్కారము :-**

**శ్లో॥ జప్యమానస్య మంత్రస్య గోపనం త్వప్రకాశనమ్॥**

**కర్మపరము:-** తానుజపించు మంత్రమును బహిర్గతము గావించ కుండుటయే (ఇతరులకు తెలియనీయకుండుట) గోపన సంస్కారము.

**మంత్రపరము:-** మూలమంత్రమున కాద్యంతములను హ్రీం బీజ సంపుటి గావించి 1008 పర్యాయములు జపించవలెను.

(ఉద:- హ్రీం ఓం గం గణపతయే నమః హ్రీం)

(ఈ మంత్ర సంస్కారములు "శారదతిలక" మను గ్రంథము నుండి గ్రహించబడినవి)

## మంత్ర దోషములు

**శ్లో॥ అభక్త్యక్షర భ్రాంతిశ్చ లుప్తోభిన్నం తథాహ్రస్వమ్ ।**
**దీర్ఘం కథనస్స్వప్నాని మంత్రాణాం దోషమష్టభిః**

మంత్రమును జపరముగా నుపయోగించునప్పుడు ఎనిమిది విధములగు దోషములు ప్రాప్తించకుండా జాగ్రత్త వహించాలి. ఆ దోషముల లోనే దోషము కల్గినను ఆ మంత్రమును సిద్ధించుట దుర్లభము.

1. అభక్తి 2. అక్షరభ్రాంతి 3. లుప్తము 4. ఛిన్నము
5. హ్రస్వము 6. దీర్ఘము 7. కథనము 8. స్వప్నకథనము

అనునవి ఎనిమిది దోషములు ఈ క్రింది విధముగా నుండగలవు.

**1. అభక్తి :-**

మంత్రము-మంత్రదేవత-గురువు అనునవి వేరువేరు పదార్థములుగా భావించుటవల్ల మనస్సు ద్వైతభావమునుజెంది ఉపాసనయందు నిశ్చలభక్తి కుదరకుండుట మరియు మంత్ర మక్షరములే కదాయను ఉదాసీనవైఖరి ఏవైనను ప్రలోభములకులోనై ఉపాసన వేడుకగా జేయుట వంటి లక్షణములు అభక్తికి తార్కాణములు. మంత్రస్వరూపసము అభిన్న నిర్గుణ పరబ్రహ్మమే అయినను తన మంత్రమున కంటెను రొక (వేరొక) మంత్రము గొప్పదను



భావము కల్గియుండుటయు అభక్తియే కాగలదు. ఇట్టి అభక్తియుతమగు జపమువలన దేవతానుగ్రహము మంత్రసిద్ధి చేకూరకపోగా విపరీత ఫలితములుకూడా ప్రాప్తించగలవు. కావున గురూపదేశమునందిన మంత్రమే ఆ దేవతాశక్తిగాను, గురువే దైవముగాను భావించి భక్తియుక్తులై మనసావాచా కర్మణా నిరంతర మంత్రోన్ముఖులై జపించవలెను.

**2. అక్షరభ్రాంతి :-**

భ్రమ-ప్రమాదములను నవి మానవ సహజ లక్షణములు గురువుగానీ, శిష్యుడుగానీ అట్టి భ్రమ-ప్రమాదములకులోనై మంత్రము నందలి అక్షరములను మార్చుట లేక అక్షరములు పెంచుట-తీసివేయుట వంటివి సంభవించిన ఆ మంత్రము దోషప్రదమై జపించువారికి సిద్ధించదు. కావున శాస్త్రవిహితమగు మంత్రమును శాస్త్రోక్త విధానముగానే జపించుట సమ్మతము.

**3. లుప్తము :-**

శాస్త్రమునందు దెలుపబడిన మంత్రాక్షరములను కొన్నిటిని తగ్గించుట లుప్త దోషము.

**4. భిన్నము:-**

మంత్రము నందలి సంయుక్తాక్షరములలో కొన్నిటిని విడచుట-అనగా ఉచ్చారణ సరిగాలేక అక్షరములను సరిగా పలకలేకపోవుట భిన్నదోషములు.

ఉ॥ "హ్రీం" అనుటకు బదులు హీం అని పల్కుట "శ్లీం" అనుటకు మారుగా శ్కీం అనిగానీ శ్లిం అనిగానీ, శీం అనిగానీ బల్కుట.

**5. హ్రస్వము:-**

మంత్రమునందలి దీర్ఘవర్ణమునకు బదులు హ్రస్వవర్ణమును బల్కుట. (హాం నకు హం-క్లీం నకు క్లిం- వాం నకు వం అని దీర్ఘరహితముగా బల్కుట)

**6. దీర్ఘము :-**

మంత్రమునందలి హ్రస్వ వర్ణములను దీర్ఘాక్షరములుగా బల్కుట ("లం" నకు మారు లాం అనియు "అగచ్ఛ"కు బదులు ఆగచ్ఛ అనియు హ్రిం ను హ్రీం అనియు)

**7. కథనము:-**

గొప్పకుగానీ మరియే ఇతర కారణములవల్లగానీ జాగ్రదవస్థ యందుండి తన మంత్రమును ఇతరులకు జెప్పుట దోషమగును.

**8. స్వప్నకథనము :-**

పై విధముగానే స్వప్నావస్థయందు తన మంత్రము నితరులకు జెప్పుట. ఈ ఎనిమిది దోషముల యొక్క సంసర్గముగల మంత్రము సాధకునకు సిద్ధింపదు. అక్షరభ్రాంతిలోగల దోషమును గురువు పరమ గురువు. పరాపర గురువులద్వారాగానీ, గురువుయొక్క శిష్య ప్రశిష్యులు ద్వారాగానీ సరిదిద్దుకొనవచ్చును. లుప్త, భిన్నదోషములను మరల మంత్రమునుపదేశము నందుట ద్వారా పోగొట్టుకొనవచ్చును. (గురువును మార్చరాదు) హ్రస్వ-దీర్ఘదోషములను గురువుద్వారా సరిచేసుకొనవచ్చును. కథన, స్వప్న కథన దోషములు గురువు విధించిన ప్రాయశ్చిత్త కర్మల ద్వారా పరిహారము కాగలవు. అభక్తి దోషమునకు మాత్రము ఏవిధమగు పరిహారమేలేదు. (విశేష సంధాన యోగ్యములగు మంత్రపల్లవాదులకు దోషములేదు)

**"గురుం ప్రకాశయేద్ధీమాన్ మంత్రం నైవ ప్రకాశయేత్"**

తన గురువు ఫలానా అని వారి గొప్పతనమును పలువురితో చెప్పుకొన వచ్చును. కానీ తాను జపించుమంత్ర మిట్టిదనిగానీ, ఆ మంత్ర దేవతను గానీ భార్యకుకూడా తెలుపరాదు.

## జపమాలా సంస్కారము

మంత్ర పురశ్చరణ మొనర్చువారికి జపమాల చాలా ముఖ్యము. చంచలమగు మనస్సును మంత్రాధిదేవత యందు నిల్పుటకు జపమాల యొక సాధనముకాగలదు. మరియు కామార్థులైనవారు లెక్కలేకుండా జపమ సలుపరాదు. కావున మంత్రజపమును లెక్కించుటకు కూడా మాల ఉపయోగకరమైనది. కావున జపమాల బహుప్రాధాన్యమైనది.

జపార్హమగు మాలలు ముత్తెరంగులుగా నుండగలవు. 1. కరమాల 2. వర్ణమాల 3. మణిమాల కుడిచేతి వ్రేళ్ళు కణుపుల నుపయోగించి లెక్కించునది కరమాల యనబడును. స్వరవ్యంజన సముదాయమగు



పంచాశద్వర్ణముల నుపయోగించిన అది వర్ణమాలకాగలదు. బంగారు పూసలు, నవరత్నముల పూసలు, స్ఫటికములు, తులసి-చందనము, రుద్రాక్షలు మొదలగు వాటిని కూర్చినమాల మణిమాల యనబడును.

**కరమాలాలక్షణం :-**

శ్లో॥ **అనామికాది ద్వయం పర్వ కనిష్ఠాది క్రమేణచ ।**
**తర్జనీ మూల పర్యంతం కరమాలా ప్రకీర్తితా ॥**

ఉంగరపుప్రేలి (అనామిక) మధ్య పర్వము (కణుపు) నుండి ప్రారంభించి క్రిందికివచ్చి చిటికెనప్రేలి మూడు కణుపులు పైకిబోయి తిరిగి అనామిక చివరి పర్వము మధ్యప్రేతి చివరిపర్వము (తర్జని) చూపుడుప్రేలి మూడు కణుపులు క్రిందికి పోవలెను. మొత్తం పదిపర్వములు కాగలవు. తిరిగి విలోమగతిలో చూపుడుప్రేలి క్రింద కణుపునుండి పై ప్రకారం వరుస తప్పకుండా అనామిక మధ్య పర్వంవరకు లెక్కించవలెను. ఈ విధముగా అనులోమ- విలోమ (ముందు వెనుకలకు) గతిలో లెక్కించిన యెడల కరమాల యనబడును.

శ్లో॥ **అంగుళ్యగ్రేషు యజ్జప్తం యజ్జప్తం మేరులంఘనే ।**
**అసంఖ్యాతంతు యజ్జప్తం తత్సర్వం నిష్ఫలంభవేత్ ॥**
**మధ్యమాది ద్వయం పర్వం జపకాలేతు వర్జయేత్ ।**
**తంవై మేరువిజానీయా త్కథితం బ్రహ్మణాపురా ॥**

ఈ కరమాలయందు తెలుపబడిన వ్రేళ్ళు పర్వములు మాత్రమే (వ్రేలిరేఖలకు గల మధ్యభాగము) గ్రైకొనదగియున్నది. వ్రేళ్ళు చివరి భాగములతో మంత్రజపము చేయరాదు. మరియు మేరువును దాటుట-వ్రేలియొక్క మొదటి, రెండవ పర్వములు (క్రిందినుండి) మేరువుగా పూర్వము బ్రహ్మచే దెలుపబడినవి. కావున ఈ రెండు పర్వములు-బొటనవ్రేలు జపకాలమునం దుపయోగించరాదు.

**మాతృకా (వర్ణ) మాలాలక్షణం :-**

**అనులోమ విలోమాక్లై ర్మాతృకాయాః స బిందుకై ః ।**
**సమేరుకైః సాష్టవర్గై ర్మాలాస్యా ద్యోగినాం శుభా ॥**

మాతృకలు అనగా స్వరములు వ్యంజనములు అను అక్షర సముదాయము. ఇవి మొత్తము 51. వీనిలో చివరిదగు "క్ష" కారము మేరువుగా దెలుపబడినది. ఈ అక్షరములు మొత్తం 8 వర్గులుగా విభజించబడినవి.

| | |
|---|---|
| 1. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః | =16 |
| 2. క ఖ గ ఘ ఙ | 5 |
| 3. చ ఛ జ ఝ ఞ | 5 |
| 4. ట ఠ డ ఢ ణ | 5 |
| 5. త థ ద ధ న | 5 |
| 6. ప ఫ బ భ మ | 5 |
| 7. య ర ల వ | 4 |
| 8. శ ష స హ ళ (క్ష) | 5 |
| మొత్తం | 50 |

ఈ మాతృకలకు బిందువునుజేర్చి (సున్నా) మంత్రమున కను సంధానము గావించి అనులోమ-విలోమ క్రమముగా జపించగా 100 సంఖ్య యగును. పిమ్మట ఏ వర్గమునకావర్గాక్షరము లన్నియు సంధించి జపించగా (100+8=108) జపముకాగలదు. "క్ష" అను మాతృకను మాలాంకమునందు మనస్సులో స్మరించవలెను.

**శ్లో॥** పంచాశదక్షరాణ్యత్రానులోమ ప్రతిలోమతః ।
ఇత్యేవం స్థాపయేత్ స్పష్టం నకస్మై చిత్ప్రదర్శయేత్ ॥
వర్ణైర్విన్యస్తయా యస్తు క్రియతే మాలయాజపః ।
ఏకవారేణతస్త్యైవ పురశ్చర్యా కృతాభవేత్ ॥

ఏబది వర్ణములతో కూడిన వర్ణమాల యందలి ప్రతి వర్ణమునకు మంత్రమును సంధించి ఆకారమునుండి ళకారమువరకు తిరిగి ళకారము నుండి అకారమువరకు మానసికముగా జపించునటవల్ల సంపూర్ణ పురశ్చర్యాఫలము ప్రాప్తించగలదు. మానవ దేహమునందలి షట్చక్రములకు ఈ వర్ణములకు అతిదగ్గర సంబంధ ముండుటవల్ల ఆ చక్రదళములయందే



వర్ణముకలదో ఆ వర్ణమును మంత్రసహితముగా ఆదళస్థానమందు (తన శరీరంలో) భావనజేసి జపించుయోగి తప్పక పరమాత్మను దర్శించి ముక్తినందగలడు, బాహ్యముగా ప్రదర్శింపరానిది. అంతర్గతా రాధనకు యోగ్యమైనది నగు ఈ వర్ణమాలాజపము సత్వరసిద్ధికి- దైవసాక్షాత్కారమునకు మిగుల దోహదపడగలదు.

**శ్లో॥ మాతృకాదియుతం మంత్రం ద్వాదశాబ్దంతు యోజయేత్ ।
క్రమేణలభతే జ్ఞానమణిమాది గుణాన్వితమ్ ॥**

వర్ణమాలతోటి ప్రత్యక్షర సంధానమగు మంత్రమును పదిరెండు సంవత్సరములు విడువక జపించినయెడల అణిమాది అష్టసిద్ధులతో కూడినట్టి బ్రహ్మజ్ఞానము ప్రాప్తించగలదు.

1. అణిమాసిద్ధి 2. లఘిమాసిద్ధి 3. గరిమాసిద్ధి 4. మహిమాసిద్ధి 5. ఈశిత్వసిద్ధి 6. వశిత్వసిద్ధి 7. ప్రాప్తిసిద్ధి 8. ప్రాకామ్యసిద్ధి యనునవి అష్టసిద్ధులు.

**మణిమాలాలక్షణం :-**

**శ్లో॥ రుద్రాక్ష శంఖ పద్మాక్ష పుత్రజీవక మౌక్తికైః ।
స్ఫాటికైర్మణి భీరత్నైః సౌవర్ణై ర్విద్రుమైస్తథా ।
కుశపర్వై ర్ద్వాదశస్యు గృహస్థస్యాక్షమాలికాః ॥**

గృహస్థులు మంత్రపురశ్చరణ మొనర్చుటకు 1. రుద్రాక్షలు 2. శంఖములు 3. తామరపూసలు 4. పుత్రజీవిగింజలు 5. ముత్యములు 6. స్ఫటికములు 7. మణులు 8. రత్నములు 9. బంగారు పూసలు 10. పగడములు 11. తులసిపూజ 12. దర్భముడులు అనునవి కూర్చిన జపమాలలు ఉత్తమోత్తమములు.

"రుద్రాక్షైః సర్వ కళ్యాణి ఈప్సితార్థ ఫలప్రదా" అని దెల్పుట వలన అన్ని విధములగు కామ్యకర్మలయందు రుద్రాక్షలుగలమాల సిద్ధిప్రదము కాగలదు. మరియు జపఫలమును వృద్ధిగావింపగలదు.

**శ్లో॥ అష్టోత్తర శతమాలా తత్రస్యాదుత్తమోత్తమా ।
శత సంఖ్యోత్తమా మాలా పంచశన్మధ్యమామతా ।
చతుః పంచాశతో యద్వా అధమాసప్త వింశతి ॥**

నూట ఎనిమిది పూసలుగల మాల ఉత్తమోత్తమమైనది. నూర్ర పూసలుగలమాల ఉత్తమము. 54-50 పూసలుగలమాల మధ్యను ఫలప్రదము 27 పూసలుగలమాల అధమముగా నెరుంగవలెను. ఈ పూసలు గ్రుచ్చుటకు దారమును తాను స్వయముగా పేనుటగానీ లేక బ్రాహ్మణ కన్యద్వారా సేవించుటగానీ జేయవలెను. తెలుపు ఎరపురంగు నూలు శ్రేష్ఠము నలుపురంగు నిషిద్ధము పట్టునూలు ఉత్తమోత్తమము- మామూలుదూది నూలు మధ్యమము, ఈనూలును మూడుపోగులుగా దీసి వాటిని పేని తిరిగి అటువంటివి మూడుకలిపి పేనిన సూత్రమునందు మణి రుద్రాక్షాదులను గ్రుచ్చవలెను. పూసకు - పూసకు మధ్య ఒకముడి యుండవలెను. జపసంఖ్యకు నిర్ణయించిన పూసలుగాక వాటిరెండు ప్రక్కలకు అనుసంధించి మరియొకపూస మేరువుగా నెలకొల్పవలెను. దారమునందేగాక ఈ పూసలను బంగారు, వెండితీగెలతో కూడా మాలగా తయారు గావించ వచ్చును.

**మాలాసంస్కారము :-**

తూర్పుముఖముగా నొకపీఠము నేర్పరచి దానిని పసుపు కుంకుమలతో అలంకరించిన పిమ్మట మధ్యభాగమునందొక రావి యాకునుంచి ఎనిమిది దిక్కులందు ఎనిమిది రావి యాకులు పద్మదళములవలె నేర్పరుచవలెను తరువాత జపమాలను మధ్యగల రావియాకు నందుంచవలెను.

శ్లో॥ క్షాళయేత్పం చ గవ్యైస్తాం సద్యోజాతేన తజ్జలైః ।
చందనాగరు గంధాద్యైర్వామదేవేన ఘర్షయేత్ ॥
ధూపయేత్తామఘోరేణ లింపేత్తత్పురుషేణతు ।
మంత్రయేత్పంచమేనైవ ప్రత్యేకం తు శతం శతమ్ ॥
మేరుం చ పంచమేనైవ తథామంత్రేణ మంత్రయేత్ ।
యేసప్రతిష్ఠితామాలా తమేవతు మనుంజపేత్ ॥

ముందు పంచగవ్యములతో (1. ఆవుపాలు 2. ఆవు పెరుగు 3. ఆవునెయ్యి 4. గోమూత్రం 5. గోమయం) మాలనుకడిగి పిమ్మట "సద్యోజాతం ప్రపద్యామి" అను మంత్రముతో నూట ఎనిమిదిమార్లు గంగా జలము లేక శుద్ధ జలములచే అభిషేకము గావించవలెను. తరువాత "వాసుదేవాయనమో" యను మంత్రముచే 108 మార్లు చందనాగరు



శ్రీగంధాది సుగంధ ద్రవ్యములచే ధూపము వేయవలెను. పిమ్మట "తత్పురాషాయ" యను మంత్రముచే గంధ పుష్పాక్షతలచే మాలనలంకరించ వలెను- "అసునీతే" మంత్రముచే ప్రాణప్రతిష్ఠ గావించి "ఈశాన స్సర్వవిద్యానాం" అను మంత్రముచే 108 మారులు అభిమంత్రించవలెను. పిమ్మట - మాలాధ్యానము నీ క్రింది విధముగా జేయవలెను.

శ్లో॥ మాలేమాలే మహామాలే సర్వతత్త్వ స్వరూపిణీ ।
చతుర్వర్గస్త్వయి న్యస్త స్తస్మాన్మే సిద్ధిదాభవ ॥

మాలను ఇతరులకు కనుపించువిధముగా నుంచరాదు. అదేవిధముగా మంత్రమును ఇతరులకు వినిపించు విధముగా పలుకరాదు. గోముఖా కారముగల పట్టు సంచిలో మాలనుంచి జపించుట ఉత్తమము. జపసమయమునందు మాలను ఊపరాదు. క్రిందకు జారవిడువకూడదు. జపసమయమునందు మాల తెగిపోవుట మృత్యుపదము. కావున జపము నొనర్చునప్పుడు మాల విషయంలో బహు జాకురూకులై యుండవలెను. జపముచేయు మాలను కంఠమునందు ధరించరాదు. ధారణకు మరొక మాలను వాడవలెను. పైవిధముగా మాలాధ్యానము గావించి ఆమాలను గోముఖమందు గోప్యముగానుంచి ప్రారంభంలో 5 అప్పుతులు అనులోమ విలోమ క్రమంలో బిందు యుక్తముగా మాతృకలను జపించి పిమ్మట మంత్రజపము గావించవలెను. (ఈ సంస్కారము నూతన మాలలకు మాత్రమే)

## జపనియమములు

శ్లో॥ సత్యాచారో సదాభక్తిః మితభాషశ్శుచిః పరః ।
స్వధర్మ విహిత స్సత్వః జితేంద్రియాష్టభిః ర్గుణః ॥

మంత్ర పురశ్చరణము గావించుటకు సాధకునికి ముఖ్యమగు అర్హతలు ఎనిమిది కలవని శాస్త్రవచనము. 1. సత్యవ్రతము (అబద్ధమాడ కుండుట) 2. ఆచారపాలనము (వేదమతాను సరణీయమగు వర్తన కలిగియుండుట) 3. భక్తిభావము (తల్లిదండ్రులు-గురువు మంత్రము మంత్రదేవతలయందు అత్యంత విధేయతకల్గి యుండుట) 4. మిత భాషణము (లౌకిక

వ్యవహారములకు దూరముగా ఉంటూ అత్యవసరమగు నప్పుడే క్లుప్తముగా మాట్లాడు చుండుట) 5. శుచిత్వము (దేహమును, మనస్సును కల్మషరహితము గాను నిరంతరము స్వచ్ఛముగాను నుంచుకొనుట) 6. స్వధర్మనిరతి - (తన ఆశ్రమమునకు దగిన ధర్మములను దప్పక-ధర్మము తదంగ భూతముగ కర్మానుష్ఠానముల నొనర్చుచుండుట) 7. సాత్వికత - (అహంకారము - దాంబికము - కోపము మొదలగు పతన కారణములైన వాటిని పూర్తిగా విడనాడి సర్వభూతదయా పరత్వము జీవకారుణ్యము, సామాజికప్రేమ, శాంతి,సుహృద్భావములు కల్గియుండుట) 8.జితేంద్రి యత్వము - (తన శరీరేంద్రియములను తన చెప్పుచేతలతో నుంచుకొనుట) అను ఎనిమిది విధములగు అర్హతలు కల్గినప్పుడే సాధకునికి మంత్రపురశ్చర్య (జపము) వల్ల దేవతానుగ్రహముకల్గి మంత్రసిద్ధి చేకూరగలదు. పై విధములగు అర్హతలు లేకుండా మంత్రమును ఎన్నికోట్లు జపించినను నిష్ఫలమే కాగలదు.

**సాధారణ నిత్యనియమాలు :-**

సూర్యోదయాత్పూర్వం శిరఃస్నానం - సంధ్యోపాసన - త్రిపుండ్ర లేక ఊర్ధ్వపుండ్రధారణ (బొట్టు, విభూది, నామములు మొ॥నవి) నిత్య ఔపాసన లేక అగ్నికార్యము బ్రహ్మయజ్ఞము - దైవ నిర్మాల్య విసర్జనము మంత్రజపము, గృహస్థ ధర్మానుబద్ధమగు లౌకిక వ్యవహారములు, పునఃశిరఃస్నానము సంధ్యస్నానాంగ దేవర్షి పితృతర్పణములు, దేవతార్చన వైశ్యదేవము, అతిధిపూజనము, భూతబలి, సాత్వికభోజనము, మాతా పితృసేవనము, శాస్త్రాధ్యయనము, సాయంకాల శిరఃస్నానము, సంధ్యావందనము, ఔపాసన లేక అగ్ని కార్యము, జపము, దైవార్చన, భోజనము, సద్గంథ పఠనము, ఆత్మవిమర్శన, శయనము ఇవి ప్రతినిత్యము ఆచరించదగిన సాధారణ నియమములు.

స్నానానంతరము తడివస్త్రముగట్టి సంధ్యాజపతపాదికర్మలు జరుపకూడదు. మడివస్త్రము, ధావళి, పట్టువస్త్రమువంటి పొడి వస్త్రములు ధరించి దైవకార్యములు నిర్వహించవలెను. విభూది, కుంకుమ, నామములు వంటి సాంప్రదాయక తిలకము (బొట్టు) ధరించిన పిమ్మటనే ఏకర్మనైనను యొనర్పవలెను. దైవకార్యములందు కట్టువస్త్రమొక్కటియేగాక పై



వస్త్రముకూడా (ఉత్తరీయము) నుండవలెను. (స్త్రీలకి నియమములేదు) కట్టుకొన్న వస్త్రమునే కొంతభాగము భుజముపై వేసుకొనుట లేక శిరముపై ముసుగు వేసికొనుట కూడదు. లోపలగోచీ పెట్టుకోకుండా ఏకకర్మలను ఆచరించరాదు. గూడకట్టు పనికిరాదు. శిఖా - యజ్ఞోపవీతములు లేకుండా జేయు కర్మలన్నీ గృహస్థులకు నిష్ఫలములు కాగలవు. క్షీరాభ్యంగన స్త్రీ సంగమములందు శాస్త్రవిధులు పాటించవలెను.

**నైమిత్తిక నియమములు :-**

ప్రత్యేక సందర్భములందు కొంతకాల నియమము నేర్పరచుకొని మంత్రపురశ్చరణము జేయదలంచిన యెడల ప్రత్యేక దీక్షావస్త్రములే ధరించవలెను. కార్యక్రమమును నిర్వర్తించు ప్రదేశమును వదలి ఎక్కడికినీ వెళ్ళకూడదు. అట్టి దీక్షాకాలము పూర్తియగువరకు క్షారము, అభ్యంగనము, తైలలేపనము, స్త్రీ సహచర్యము, ఇతరులసేవ లౌకిక వ్యవహారాదులు, నీచజనుల దర్శనము, సంభాషణము, యధేచ్చా వర్తనములు పూర్తిగావదలి వేయవలెను. సాత్వికమగు స్వల్పాహారము భుజింపుచు జితేంద్రియుడై మనసును మంత్రమునందు సంయమనము గావించి దీక్షాంగవిధులు నిర్వర్తింపుచు అధిక సమయము మంత్రజపము నందు గడుపుచండవలెను. భూమిపై దర్భలుపరచి వాటిపై పరుండవలెను. పగటివేళ శనించరాదు. తైలపక్వములు, క్షారలవణములు, విసర్జించవలెను. ధనకాంక్ష, కళత్రభ్రాంతి, పుత్ర, బంధు ప్రేమలు మనస్సునందు కల్గినయెడల దీక్షాభంగము కాగలదు. ప్రాణత్యాగమున కైనను సిద్ధపడవలెనేగానీ దీక్షాభంగమును జేయరాదు. ఇట్టి దీక్షాకాలు నందుగురు, దేవతా మంత్రములకు మాత్రమే సాధకుడు లొంగియుండును. తదన్యములన్నియు పరిత్యాజ్యములే కాగలవు. పురస్చర్యా దీక్షా కాలమునందు దైవికముగా సంభవించు ఉపద్రవములు దీక్షాభంగ దోషము నొసంగవు.

## జపవిధానము

శ్లో॥ భూశుద్ధిర్భూత శుద్ధిశ్చ బహిరంగ తశ్చ మాతృకం ।
కూర్మచక్రం శిఖాబంధం దిశా దిగ్బంధ్యం తథా ॥
షడంగన్యాసకం చైవ ప్రాణస్థాపన మేవచ ।
జపారంభస్య నిత్యం చ మంత్రస్యాంగాని వైదశ ॥

మంత్రజపమునకు అంగభూతములగు క్రియలు పది దెలుపబడినవి. స్నానసంధ్యాది నిత్యకర్మలు పూర్తిఐన పిమ్మట జపారంభ సమయమునందీ నది విధములగు మంత్రాంగములను ఆచరించవలెను. ఇందు 1. భూశుద్ధి 2. కూర్మచక్రలేఖనము 3. ఆసపనపరికల్పము 4. శిఖాబంధనము 5. భూతశుద్ధి 6. దిశాదిగ్బంధనము 7. షడంగన్యాసము శరీరశోధనము 8. ప్రాణప్రతిష్ఠ 9. బహిర్మాతృకాన్యాసము 10. అంతర్మాతృకాన్యాసము -

**1. భూశుద్ధి :-**

శ్లో॥ నత్వాన్ గురూన్ గణేశానం భూమిశుద్ధిం నమాచరేత్ ।
ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖో వా జపేద్విద్యాం విచక్షణః ॥

గురువును ధ్యానించి, గణపతికి నమస్కరించి తూర్పు లేక ఉత్తర ముఖముగా కూర్చుని జపము నాచరించుటకు ముందు భూమిని శుద్ధి గావించవలెను.

జపమొనర్చదగిన స్తలమందు కుశలలో ఉదకమును ప్రోక్షించి

శ్లో॥ విష్ణుశక్తి సముత్పన్నే శంఖవర్ణ మహీతలే ।
అనేకరత్న సంభన్నే శ్రీ భూదేవి నమోఽస్తుతే ॥

అనిధ్యానము గావించి పంచోపచారపూజలు సలుపవలెను పిమ్మట

మం॥ ఓం ధనుర్ధరాయ విద్మహే । సర్వ సిద్ధ్యైచ ధీమహి ।
తన్నోధరా ప్రచోదయాత్ ॥

అను మంత్రమును పదిమార్లు జపించవలెను. ( భూగాయత్రీ మంత్రం) తరువాత చేతియందు నీరుగైకొని భూగాయత్రీ మంత్రమును ఆద్యంత ప్రణవయుక్తముగా పదిరెండు పర్యాయములు జపించుట నీటి



నభిమంత్రించి, తన మూలమంత్రమును స్మరించి జపస్థలమును వీక్షించి తన చేతియందలి జలము నక్కడజల్లి, దర్భలచే "హుంఫట్" అని భూమిని కొట్టవలయును. పిమ్మట

శ్లో॥ (ఓం) పృథ్వీత్వయా ధృతాలోకా దేవిత్వం విష్ణునా ధృతా ।
త్వం చ ధారయమాం దేవి పవిత్రం కురు చా సనమ్॥
అవసర్పంతు యేభూతాః యేభూతా భూమి సంస్థితాః ।
యేభూతా విఘ్నకర్తారః తేనశ్యంతు శివాజ్ఞయా॥
అని పలుకుచు భూమిపై అక్షతలు, తెల్లఆవాలు చల్లవలెను.

**2. కూర్మచక్రలేఖనమ్ :-**

శ్లో॥ షట్కోణం చైవ అష్టపత్రం వతః పరం ।
వృత్తం లిఖిత్వా చాష్టారే త్వష్ట వర్గం విఖేత్క్రమాత్
షట్కోణస్య ముఖేమాయాం పృష్ఠేతు మదనం లిఖేత్ ॥
ఆగ్నేయాది చతుష్కోణే ప్రణవం విలిఖేత్తతః ॥
కూర్మచక్ర మిదం ప్రోక్తం మంత్రాణాం సిద్ధిదాయకమ్ ।
సంస్కారే తత్ర సంపూజ్యా వేద్యంతాః పీఠదేవతాః ॥

భూశుద్ధి గావించిన స్తలమందు షట్కోణము, దానిపైవృత్తము, పిమ్మట ఎనిమది దళములు లిఖించి ఆ షట్కోణ మధ్యభాగమునందు "హ్రీం" అనునక్షరమును క్రింది పైనగల రెండు కోణములందు "క్లీ" అను నక్షరమును మిగిలిన మూలలయందు నాల్గు కోణములందు ఓం అను ప్రణవమును ఎనిమిది దళములందు వరుసగా అం-కం-చం-టం-తం-పం-యం-శం- అను అష్టవర్గాద్యక్షరములనులిఖించిన యెడల అది కూర్మచక్రము కాగలదు.

**మతాంతర కూర్మచక్ర లేఖనము :-**

శ్లో॥ షట్కోణం విలేఖేచ్చక్రం ముఖే హ్రీం కార మేవచ
పృష్ఠే మన్మథ బీజం చ చతుష్కోణేషు తారకం ।
అష్టవర్గం అష్టపత్రం కూర్మచక్రం విధీయతే ।
మధ్యే హుంఫట్ స్వాహేతి జపంకోటి గుణంభవేత్ ॥ (అనియున్నది)

కూర్మచక్రమును లిఖించిన పిమ్మట దాని నీ క్రింది విధముగా పుష్పాక్షతలచే పూజించవలెను.

ఓం ఆధారశక్త్యై నమః, ఓం కూర్మాయ నమః, ఓం అనంతాయ నమః, ఓం వరాహాయ నమః, ఓం పృథివ్యైనమః, ఓం సుధార్ణవాయ నమః ఓం నవరత్నద్వీపాయ నమః, ఓం స్వర్ణశైలాయ నమః, ఓం నందనవనాయ నమః, ఓం కల్పవృక్షేభ్యో నమః, ఓం రత్న భూమి కాయైనమః, ఓం సర్ణప్రాకారాయ నమః, ఓం రత్నమండపాయ నమః, ఓం స్వర్ణవేదికాయై నమః, పూజానంతరము కూర్మచక్రముపై ఆసనము నేర్పరుచవలెను.

**3. ఆసనపరికల్పనం :-**

**శ్లో॥** కౌశేయం కంబలం చైవ ఆసనం పట్టమేవ చ।
దారుజం తాలపత్రం నా ఆసనం పరికల్పయేత్ ॥ (వ్యాసః)

చిత్రాసనము :- కంబలి, పట్టువస్త్రము, చెట్టుమ్రానియొక్క బెరడు, దర్భలు (దర్భాసనం) పీట తాటియాకుల చాప అనునవి ఆసన యోగ్యములుగా దెలుపబడినవి.

**శ్లో॥** కుశాన్వై యాఘ్ర చర్మాణి వస్త్రాణి చ యథాక్రమం
సంప్రోక్ష్య చ సమాస్తీర్య స్వస్తి కాద్యాసనం భవేత్ ॥

కుశాసనము, వైమాఘ్ర చర్మము (పులితోలు) వస్త్రము అనువాటికి ఒకదానిపై నొకటి పరచి జలప్రోక్షణగావించి స్వస్తికాది ఆసనమును వైచికొని కూర్చుండవలెను. (పద్మాసనము, అర్ధపద్మాసనము, స్వస్తికాసనము అను ఆసనములు జపము సలుపుటకు యోగ్యములు అటుపిమ్మట తాను కూర్చుండిన ఆసనమునకు ఆగ్నేయకోణము మొదలు వరుసగా ఈ క్రింది దేవతలను ఆవాహన మొనర్చవలెను.

ఆగ్నేయం - గం గణపతయే నమః వాయువ్యం - దుం దుర్గాయై నమః నైరృతి-సం సరస్వత్యై నమః ఈశాన్యం - క్షం క్షేత్రపాలకాయనమః (పుష్పాక్షతల నుంచవలెను)

**4. శిఖాబంధనము :-**

జుట్టు విరియబోసుకొని జపముచేయరాదు. స్త్రీలకేగాక-పురుషులకు కూడా వైదికసాంప్రదాయము ప్రకారం శిఖ (పిలక) యుండవలెను. శిఖలేనివాడు పాషాందునితో సమానమని శాస్త్రములు దెల్పుచున్నవి.



**శ్లో॥** శిఖాబంధం తతః కృత్వా భూతో త్సాదన మాచరేత్ ।
ప్రార్థయిత్వాఽథ చ పృథివీం సంవిశేచ్ఛ నిజాసనే ॥

శిఖాబంధనము గావించిన తరువాతనే (జుట్టుముడివేసికొనినపిదప) భూపూజ-భూతోచ్ఛజన, దిశాదిగ్బంధనాది కర్మల నాచరించవలెను.

**5. దిశాదిగ్బంధనం :-**

**శ్లో॥** సుదర్శనస్య మంత్రేణ దిశాబంధనం సమాచరేత్ ।
భూతశుద్ధిం తతః కృత్వా ప్రాణస్థాపన మాచరేత్ ॥

స్థిరచిత్తుడైన సాధకుడు స్థిరముగా కూర్చుని సుదర్శన మంత్రముచే పదిదిశలయందు దిగ్బంధనముగావించవలెను.

ఓం లం పూర్వదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥
ఓం లం ఆగ్నేయదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥
ఓం హం యామ్యదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥
ఓం షం నైరృతదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥
ఓం వం వారుణదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥
ఓం యం వాయుదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥
ఓం సం కౌబేరదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥
ఓం శం ఈశానదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥
ఓం హం ఊర్ధ్వదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥
ఓం క్షం అధోదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥
ఓం ఇం అవాంతరదిశం సహస్రార హుంఫట్ సుదర్శన బంధయామి నమశ్చక్రాయ స్వాహా॥

పైమంత్రముల నుచ్చరింపుచు పదిదిశలకు యెర్రని అక్షతలు తెల్లఆవాలు కలిపి చల్లవలెను. పిమ్మట ఈ క్రింది మంత్రమును యథా శక్తిగా జపించవలెను.

**మంత్రం:-** ఓం నమో భగవతే మహాచక్రరాజాయ సహస్రారాయ సర్వ విశోబంధ భూతాం స్త్రానయ రాక్షసాన్మారయ సహస్రార హుంఫట్ క్రోంరం స్వాహా ॥

జ్వలజ్జ్వాలాయ విద్మహే । సుదర్శనాయధీమహి। తన్న శ్చక్రం ప్రచోదయాత్ ॥

**6. భూతశుద్ధి :-**

1. పాప పురుషుడు కుక్షి (కడుపు) యందు దెడమ భాగమున నుండి నట్లు భావన జేయవలెను. (అనగా సాధకునియొక్క జ్ఞానా జ్ఞానకృత పాపములని భావము)
"యం" అను వాయుబీజమును ధ్యానించి కుడి నాసారంధ్రము ద్వారా వాయువును బీల్చవలెను. (పూరకము)
2. మనస్సుచే "రం" అను అగ్నిబీజమును ధ్యానించి ఆపాపపురుషుని దహించవలెను. (పాపదహనభావన) కుంభకమునందీ క్రియ జరుప వలెను.
3. తిరిగి "యం" అను వాయుబీజమును ధ్యానింపుచు రేచకముద్వారా అనగా యెడల నాసారంధ్రముద్వారా గాలిని బైటకు వదలుచు పాప పురుషుని భస్మము బైటకు వెడలుచున్నట్లు భావనజేయవలెను.

శ్లో॥ సార్ధత్రికోటి తీర్థాంగం సర్వదేవ మయాకృతిం ।
స్వకుక్షౌ దక్షిణే పుణ్యపురుషం చ విచింతయేత్ ॥

తిరిగి ప్రాణాయామత్రయము గావింపుచు పుణ్యపురుషుడు తన కుక్షియందు కుడి ప్రక్కన యున్నట్లు భావనజేయవలెను. అటుపిమ్మట తన ఆరాధ్యదైవముయొక్క మూలమంత్రమును జపించు అధికారము ప్రాప్తించుటకై సంకల్పము గావించి భూతశుద్ధి గావించవలెను.

అస్యశ్రీ భూతశుద్ధి మహామంత్రస్య :- పురుషఋషిః- దైవీగాయత్రీ ఛందః బ్రహ్మ విష్ణు రుద్రేశ్వర సదాశివా దేవతాః హం-యం-రం-వం-ల-బీజాని-పృధ్వివ్యప్తేజోవాయ్వాకాశా శక్తయః-తద్విలాపనా మితికీలకం-మమపాం చ భౌతిక శరీర శోధనార్థే జపే వినియోగః॥

ఓం-హం-యం-రం-వం-లం- బీజాక్షరేణ కర-హృదయాదిన్యాసం కృత్వా॥
ఓం భూర్భువస్సు వరోమితి దిగ్బంధః॥



**ధ్యానం:-**

శ్లో॥ సంచితయే త్తరుణభాను సహస్రకాంతిం ।
పాశాంకుశ ప్రవర కార్ముక పంచబాణాన్ ।
దేవీం త్రిలోకజనీనం స్వకరైర్దధా నాం ।
అంబాం భజే మణి సుమాల్య విభూషితాంగీమ్ ॥

1) ఓం లం పృథివ్యై నమః ॥
సాధకుడు పైమంత్రమును స్మరింపుచు తన పాదములనుండి మోకాళ్ళవరకుగల ప్రదేశమునందు భూతత్త్వమున్నటుల భావనజేసి పృథ్వీభూతమునకు బ్రహ్మకు నమస్కరించవలెను.
(విశేషవిధానములు గురువుద్వారా తెలిసికొనవలెను)

2) ఓం వం అద్భ్యోనమః ॥
పై విధముగానే మోకాళ్ళు మొదలు నాభి (బొడ్డు) వరకు గల ప్రదేశమందు జలతత్త్వమును భావనజేసి జలభూతమునకు విష్ణువునకు నమస్కరించవలెను.

3) ఓం రం అగ్నయే నమః ॥
పై ప్రకారంగా నాభినుండి హృదయము వరకుగల ప్రదేశమునందు అగ్నితత్త్వమును భావనజేసి అగ్ని (తేజో) భూతమునకు రుద్రునకు నమస్కరించవలెను.

4) ఓం యం వాయవే నమః॥
పై విధముగా హృదయము మొదలు కంఠమువరకుగల ప్రదేశము నందు వాయుతత్త్వమును భావనజేసి వాయుభూతమునకు ఈశ్వరునకు నమస్కరించవలెను.

5) ఓం హం ఆకాశయనమః ॥
పై విధముగా కంఠము మొదలు భ్రూమధ్యము వరకుగల ప్రదేశమునందు ఆకాశతత్త్వమును భావనజేసి, ఆకాశభూతమునకు, సదా శివునికి నమస్కరించవలెను.

"సోఽహం హంస స్సోఽహం హంస స్సోఽహం హంసః"

పై మంత్రమును యథాశక్తిగా జపించుచు పంచభూతములు తన శరీరాంతర్గతములైయుండి ఒకదానియం దొకటి ఐక్యమునుజెంది భ్రూమధ్య స్థానమునకు పైభాగమునందున్న సహస్రార చక్రమునందలి పరమాత్మతో (తన అభీష్టదైవముతో) తాదాత్మత జెందినటుల భావనజేయవలెను.

**శ్లో॥ భూతశుద్ధి విహీనేన కృత్వా పూజాఽభిచారవత్ ।**
**విపరీత ఫలందద్యా దభక్త్యా పూజనం యథా ॥**

భూతశుద్ధి గావింపకుండా జరుపబడు జపపూజాదులు దేవతలు గ్రహించరు. అట్టి పూజా-జపాదులవల్ల ఆశించిన ఫలితములు కలుగకపోగా విపరీత ఫలితములు ప్రాప్తించగలవని మంత్రశాస్త్ర గ్రంథములు దెల్పుచున్నవి.

**7. శరీరశోధన:-**

స్థూలసూక్ష్మకారణ శరీరము యందలి కర్మలు జీవులకు ముక్తికి ఆటంకములు, కావున అట్టి శరీరత్రయములచేకల్గు కర్మలను ప్రతిదినము మంత్రయుతముగా నశింపజేకొనుట మరియు అట్టి శరీరత్రయములందు దైవత్వమును నాపాదించి అమృతత్వమును కలిగించుకొనుట మంత్రానుష్ఠాన పరులకు నిత్యయుక్తమై యున్నది.

అ) ఓం ఐం హ్రీం శ్రీం ఓం రం అగ్నిగతత్వాత్మక స్థూలశరీరం పరిశోధయామి ఓం హ్రీం జుహోమి స్వాహా॥

(ఈమంత్రముచే ఉదకములోనికి పుచ్చుకొనవలెను)

ఆ) ఓం ఐం హ్రీం ఓం అం హ్రాం సుర్యతత్వాత్మక సూక్ష్మ శరీరం పరిశోధయామి ఓం హ్రీం జుహోమిస్వాహా॥ (పైవిధముగానే)

ఇ) ఓం ఐం హ్రీం శ్రీం ఓం ఉం సం సోమతత్వాత్మక కారణశరీరం పరిశోధయామి ఓం హ్రీం జుహోమిస్వాహా॥ (పైవిధముగానే)

ఈ) ఓం ఐం హ్రీం శ్రీం ఓం లం వం రం యం హం బ్రహ్మ తత్వాత్మక మహాకారణ శరీరం పరిశోధయామి ఓం హ్రీం జుహోమిస్వాహా॥

(పై విధముగానే)

**ప్రాణాయామము చేయవలెను.**



**పూరకం:-** కుడి నాసారంధ్రముద్వారా గాలిని లోపలకు పీల్చవలెను.

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం

**కుంభకం:-** పీల్చిన గాలిని రెండు ముక్కులు మూసి లోపల బంధించి ఈ క్రింది మంత్రములను ధ్యానించవలెను.

ఓం తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్।

ఓం ఐం హ్రీం శ్రీం యం యం సంకోచశరీరం శోషయశోషయ స్వాహా॥

**రేచకం:-** ఎడమ నాసారంధ్రముద్వారా లోపలిగాలిని మెల్లగా బైటికి వదలవలెను.)

ఓమాపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

తిరిగి పైవిధముగానే పూరక-కుంభక-రేచకములను జరుపుచు కుంభక స్థితియందే క్రింది మంత్రములను ధ్యానించవలెను.

**పూరకం:-** ఓం భూః............ఓగ్ం సత్యం

**కుంభకం :-** ఓం తత్సవితు.........చోదయాత్, ఓం ఐం హ్రీం శ్రీం రం రం సంకోచశరీరం దహ దహ పచ పచ స్వాహా॥

**రేచకం:-** ఓ మాపో.............వస్సువరోమ్

తిరిగిపూరకం:- ఓం భూః........ఓగ్ం సత్యం

**కుంభకం:-** ఓం తత్సవితు.......చోదయాత్, ఓం ఐం హ్రీం శ్రీం వంవం పరమశివామృతం వర్షయ స్వాహా॥

**రేచకం:-** ఓమాపో......వస్సురోమ్ ॥

**తిరిగిపూరకం:-** ఓం భూః.......ఓగ్ం సత్యం

**కుంభకం:-** ఓం తత్సవితు..........ప్రచోదయాత్, ఓం ఐం హ్రీం శ్రీం లం లం శాంభవ దివ్యశరీర ముత్పాదయ ఉత్పాదయ స్వాహా॥

**రేచకం:-** ఓమాపోజ్యోతి ................వస్సురోమ్॥

తన హృదయమునందు సంపుట తాంగుళులుగల హస్తద్వయము నుంచి ఈశ్వరభావనతో ఈ క్రింది మంత్రమును పఠించవలెను.

మం. ఓం ఐం హ్రీం శ్రీం హంస్సో౽హ మవతర అవతర శివపదా జీవ సుషుమ్నా మార్గేణ ప్రవిశ, మూలశృంగాట ముల్లన ఉల్లస, జ్వలజ్వల ప్రజ్వల హంసస్సో౽హం స్వాహా॥

హంస హంసాయ విద్మహే । పరమహంసాయ ధీమహి॥ తన్నోహం సః ప్రచోదయాత్॥

**8. ప్రాణ ప్రతిష్ఠాపనమ్:-**

అస్యశ్రీ ప్రాణప్రతిష్ఠాపన మంత్రస్య । బ్రహ్మవిష్ణు మహేశ్వరా ఋషయః । ఋగ్యజుస్సామాని ఛందాంసి । సకల చైతన్య స్వరూపిణీ ప్రాణశక్తిః పరాదేవతా॥ అంబీజం । హ్రీం శక్తిః । క్రోం కీలకం । ప్రాణప్రతిష్ఠాపనే వినియోగః॥

1. అం హ్రీం క్రోం అం జం కం ఖం ఘం గం ఆం క్రోం హ్రీం ఆం ఆకాశవాయువ్యగ్న్య పృథ్వ్యాత్మనే - అంగుష్ఠాభ్యాం నమః = = హృదయాయ నమః
2. ఆం హ్రీం క్రోం ఇం ఞం చం ఛం ఝం జం ఈం క్రోం హ్రీం ఆం శబ్దస్పర్శ రూపరస గంధాత్మనే-తర్జనీభ్యాం నమః = =శిరసేస్వాహా
3. ఆం హ్రీం క్రోం ఉం ణం టం ఠం ఢం డం ఊం క్రోం హ్రీం ఆం శ్రోత్ర త్వక్చక్షు ర్జిహ్వా ఘ్రాణాత్మనే-మధ్యమాభ్యాం నమః = = శిఖాయైవషట్
4. ఓం ఆం హ్రీం క్రోం ఏం నం తం థం ధం నం ఐం క్రోం హ్రీం ఆం వాక్పాణి పాదపాయూపస్థాత్మనే - అనామికాభ్యాం నమః = =కవచాయహుం
5. ఓం ఆం హ్రీం క్రోం మం ఫం భం బం ఔం క్రోం హ్రీం ఆం వచన దాన గమన విసర్గానం దాత్మనే - కనిష్ఠకాభ్యాం నమః ==నేత్రత్రయావౌషట్
6. ఆం హ్రీం క్రోం అం శం యం రం వం లం హం షం సం క్షం అః క్రోం హ్రీం ఆం బుద్ధి మనో౽హంకార చిత్తాత్మనే - కరతలకరపృష్ఠాభ్యాం నమః = అస్త్రాయఫట్

(ఓం భూర్భువస్సు వరోమితి దిగ్బంధః)



**ధ్యానమ్ :-**

శ్లో॥ రక్తాంభోధిస్థ పతోల్లసదరుణ సరోజాధిరూఢా కిరాబ్జైః ।
శూలం కోదండ మిక్షూద్భవ గుణగణ మప్యం కుశం పంచబాణాన్ ।
బిభ్రాణా సృక్కపాలం త్రినయన వపుషా పీనవక్షో రుహాఢ్యా ।
దేవీ బాలార్క వర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరాణః॥

(తన హృదయమునందు కుడిహస్తమునుంచి ఈ క్రింది మంత్రములు పఠించవలెను)

ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హోం॥ ఓం క్షం సం హం సః హ్రీం ఓం మం సః మమ (అముష్య) ప్రాణా ఇహ ప్రాణాః ॥

ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హోం । ఓం క్షం సం హం సః హ్రీం ఓం హంసః మమ (అముష్య) జీవ ఇహస్థితః ।

ఓం అం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హోం॥ ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః । మమ (అముష్య) సర్వేంద్రియాణి వాఙ్మనశ్చక్షు శ్రోత్ర ఘ్రాణ ప్రాణా ఇహైవాగత్య సుఖం చిరం తిష్ఠంతు స్వాహా॥ ఓం క్షం సం హం సః హ్రీం ఓం॥

మం. ఆం ఓం ఓం అసునీతే పునరస్మా సుచక్షుః పునః ప్రాణ మిహినో దేమి భోగం జోక్పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమతే మృళయాన స్వస్తి॥

మం. ఆం ఓం ఓం అమృతం వైప్రాణా అమృతమాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వాయతే॥

మం. ఆం ఓం ఓం మనోజ్యోతి ర్జుషతా మాజ్యం విచ్ఛిన్నం యజ్ఞగ్ం సమిమం దధాతు । బృహస్పతిస్తనుతా మిమంనో విశ్వేదేవా ఇహామా దయన్తామ్॥

యో౽హమస్మి బ్రహ్మా హమస్మి అహమస్మి బ్రహ్మైవాహమస్మి॥

ఓం ప్రతిష్ఠ - ఓం భూర్భువస్సువః సుప్రతిష్ఠ తమస్తు ॥

**9. బహిర్మాతృకాన్యాసం :-**

## 10. అంతర్మాతృకాన్యాసం :-

బహిర్మాతృ కన్యాసము పది విధములుగా నుండగలదు. నిత్యజప విధానమునందు "ప్రపంచయాగ మాతృకాన్యాసము" జరుపుట ముఖ్యము. అకారాది క్షకారాంత వర్ణములను బిందుయుతముగా తన శరీరావయవము లందు సుప్రతిష్ఠితము గావించుకొను క్రియ బహిర్మాతృకాన్యాస మనబడును. అదేవిధముగా స్వర వ్యంజనముల నన్నిటినీ శరీరాంతర్గతములగు షట్చక్రములయందు భావనజేయుటను అంతర్మాతృకాన్యాస మందురు. యోగమార్గముద్వారా కుండలినీ ప్రబోధమొనర్చి బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి అను అంతర్గత సంధిస్థానములను ఛేదించి ఆయా చక్రస్థదళ ములం దాయా వర్ణములను, ఆవర్ణదేవతలను ధ్యానించుట ఉత్తమమగు అంతర్మాతృకాన్యాసము - కేవల అంతర్గత చక్రస్థిత వర్ణభావనము సాధారణ లక్షణము. బహిరంర్మాతృకాన్యాసములు జపప్రారంభావస్థానము లందు జరుపుట చాలాముఖ్యము. ఈ న్యాసక్రియా చరణమువల్ల వర్ణ వ్యత్యాసాది అనేక దోషములు పరిహరించబడి మంత్రదేవతాను గ్రహము శీఘ్రముగా ప్రాప్తించగలదు.

శ్లో॥ మాతృకాఖ్యో జపస్యాదౌ జపస్యాంతే కృతోయది ।
వర్ణవ్యత్యాసాది దోషా నశేషాన్ హంతి తం శృణు॥
జపాదే సర్వమంత్రాణాం విన్యాసేన విపేర్వినా ।
కృతం తన్నిష్ఫలం విద్యాత్తస్మా త్సర్వాం లిపింన్యసేత్ ॥
అకృత్వాన్యాసజాలం యాముధాత్మా కురుతేజపం ।
విఘ్నై స్సబాధ్యతే నూనం వ్యాఘ్రైర్మృగ శిశుర్యథా ॥

సాధకులు మూఢత్వముచేతగానీ, మరియే ఇతర కారణములచేత గానీ మాతృకాన్యాసము జరుపకుండా మంత్రజపమును గావించిన యెడల ఆ మంత్రసిద్ధికి అనేక విఘ్నములు కల్గుటేగాక పులి లేడి పిల్లను నశింపజేసినటుల ఆ మంత్రము సాధకుని కపకారమొనరించగలదు. కావున మంత్రానుష్ఠాన పరులగువారు తమ గురు సాంప్రదాయాను సారముగా ప్రతినిత్యము జప ప్రారంభమునందు విధిగా మాతృకాన్యాసము చేయవలెను.



మాతృకాన్యాసము ప్రారంభించుటకుముందు ఆచనముగావించి (ఈ ఆచమనము మూడు విధములుగా దెలుపబడియున్నది. ఆ విధానము లన్నియు గురువులద్వారా తెలిసికొని ఆచరించవలెను) పిమ్మట మాతృకావర్ణములచేత ముమ్మారులు ప్రాణాయామమును జేయవలెను. అటు పిమ్మట సంకల్పమునుజేసి ఈ క్రింది మంత్రముచే కరశుద్ధి నొనర్చుకొనవలెను.

మం॥ అం ఈం ఊం ఐం ఔం అః॥ (కరశుద్ధి మంత్రము)

## బహిర్మాతృకాన్యాసం :-

ఇందలి న్యాసాదిగాగల విధానములు మా గురు సాంప్రదాయము ననుసరించి వ్రాయబడుచున్నవి. ఇతర సాంప్రదాయములందు అచ్చటచ్చట స్వల్పభేదములుండవచ్చును. కానీ మూలస్థితికి భంగముండదు. కావున సాధకులు వారి గురు సాంప్రదాయ విధానములనే అవలంభించుట శాస్త్ర విహితము. బహుముఖ వ్యాప్తిగల మంత్రమును దేశకాల పాత్రాదుల ననుసరించి మహర్షులు అనేక విధములుగా జెల్పియుండిరని యెల్లరు గ్రహించగలరు (గ్రంథకర్త)

అస్యశ్రీ బహిర్మాతృకాన్యాస మంత్రస్య । బ్రహ్మాఋషిః । గాయత్రీ ఛందః । శ్రీమాతృకా సరస్వతీ దేవతా । హలో బీజాని । స్వరాశ్శక్తయః । బిందవః కీలకం । బహిర్మాతృకాన్యాసే యోగః॥

| షడంగన్యాసం | కరన్యాసం | హృదయాదిన్యాసం |
|---|---|---|
| అం కం ఖం గం ఘం జం అం | అంగుష్ఠాభ్యాంనమః | హృదయాయనమః |
| ఇం చం ఛం జం ఝం ఞం ఈం | తర్జనీభ్యాం నమః | శిరసేస్వాహా |
| ఉం టం ఠం డం ఢం ణం ఊం | మధ్యమాభ్యాం నమః | శిఖాయైవషట్ |
| ఏం తం థం దం ధం నం ఐం | అనామికాభ్యాం నమః | కవచాయహుం |
| ఓం పం ఫం బం భం మం ఔం | కనిష్ఠికాభ్యాం నమః | నేత్రత్రయామవౌషట్ |
| అం యం రం లం వం శం షం | కరతలకరపృష్ఠాభ్యాంనమః | అస్త్రాయఫట్ |
| సం హం ళం క్షం అః | | |

ఓం ఇతి దిగ్బంధః =

**ధ్యానం :-**

**శ్లో॥ పంచాశ ద్వర్ణభేదై ర్విహిత వదన దోః పాదయుక్కుక్షివక్షో**
**దేశాం భాస్వత్కపర్దా కలిత శశికళా మిందుకుందావ దాతామ్ ।**
**అక్షస్రక్కుంభ చింతాలిఖిత వరకరాం త్రీక్షణాం పద్మసంస్థాం ।**
**అక్షాకల్పా మతుచ్ఛస్తన జఘన భరాం భారతీం తాం నమామి॥**
పంచోపచారై స్సంపూజ్య ॥ (పంచపూజలు జరుపవలెను)

ఈక్రింద తెలుపబడిన విధముగా మంత్రము నుచ్చరించుచు దెలుపబడిన శరీర స్థానములయందు స్పృసించి ఆ స్థానము మంత్రపూత మైనటుల భావించవలెను.

ఓం ఐం హ్రీం శ్రీ అం నమః - శిరసి
ఓం ఐం హ్రీం శ్రీ ఆం నమః - ముఖవృత్తే
ఓం ఐం హ్రీం శ్రీ ఇం నమః - దక్షిణనేత్రే
ఓం ఐం హ్రీం శ్రీ ఈం నమః - వామనేత్రే
ఓం ఐం హ్రీం శ్రీ ఉం నమః - దక్షిణకర్ణే
ఓం ఐం హ్రీం శ్రీ ఊం నమః - వామకర్ణే
ఓం ఐం హ్రీం శ్రీ ఋం నమః - దక్షిణనాసాపుటే
ఓం ఐం హ్రీం శ్రీ ౠం నమః - వామనాసాపుటే
ఓం ఐం హ్రీం శ్రీ ఌం నమః - దక్షిణకపోలే
ఓం ఐం హ్రీం శ్రీ ౡం నమః - వామకపోలే
ఓం ఐం హ్రీం శ్రీ ఏం నమః - ఓష్ఠే
ఓం ఐం హ్రీం శ్రీ ఐం నమః - అధరే
ఓం ఐం హ్రీం శ్రీ ఓం నమః - ఊర్ధ్వదంతపంక్తౌ
ఓం ఐం హ్రీం శ్రీ ఔం నమః - అధోదంతపంక్తౌ
ఓం ఐం హ్రీం శ్రీ అం నమః - జిహ్వాయాం
ఓం ఐం హ్రీం శ్రీ అః నమః - ఆస్యవివరే
ఓం ఐం హ్రీం శ్రీ కం నమః - దక్షిణబాహుమూలే
ఓం ఐం హ్రీం శ్రీ ఖం నమః - దక్షిణకూర్పరే
ఓం ఐం హ్రీం శ్రీ గం నమః - దక్షిణమణిబంధే
ఓం ఐం హ్రీం శ్రీ ఘం నమః - దక్షిణాంగుళిమూలే



ఓం ఐం హ్రీం శ్రీ ఙం నమః - దక్షిణకరాంగుళ్యగ్రే
ఓం ఐం హ్రీం శ్రీ చం నమః - వామబహుమూలే
ఓం ఐం హ్రీం శ్రీ ఛం నమః - వామకూర్పరే
ఓం ఐం హ్రీం శ్రీ జం నమః - వామమణిబంధవే
ఓం ఐం హ్రీం శ్రీ ఝం నమః - వామకరాంగుళిమూలే
ఓం ఐం హ్రీం శ్రీ ఞం నమః - వామకరాంగుళ్యగ్రే
ఓం ఐం హ్రీం శ్రీ టం నమః - దక్షిణోరుమూలే
ఓం ఐం హ్రీం శ్రీ ఠం నమః - దక్షిణజానునీ
ఓం ఐం హ్రీం శ్రీ డం నమః - దక్షిణగుల్ఫే
ఓం ఐం హ్రీం శ్రీ ఢం నమః - దక్షిణపాదాంగుళిమూలే
ఓం ఐం హ్రీం శ్రీ ణం నమః - దక్షిణపాదాంగుళ్యగ్రే
ఓం ఐం హ్రీం శ్రీ తం నమః - వామోరుమూలే
ఓం ఐం హ్రీం శ్రీ థం నమః - వామజానునీ
ఓం ఐం హ్రీం శ్రీ దం నమః - వామగుల్ఫే
ఓం ఐం హ్రీం శ్రీ ధం నమః - వామపాదాంగుళిమూలే
ఓం ఐం హ్రీం శ్రీ నం నమః - వామపాదాంగుళ్యగ్రే
ఓం ఐం హ్రీం శ్రీ పం నమః - దక్షిణపార్శ్వే
ఓం ఐం హ్రీం శ్రీ ఫం నమః - వామపార్శ్వే
ఓం ఐం హ్రీం శ్రీ బం నమః - పృష్ఠే
ఓం ఐం హ్రీం శ్రీ భం నమః - నాభౌ
ఓం ఐం హ్రీం శ్రీ మం నమః - జఠరే
ఓం ఐం హ్రీం శ్రీ యం త్వగాత్మనే నమః - హృదయే
ఓం ఐం హ్రీం శ్రీ రం అసృగాత్మనే నమః - దక్షాంసే
ఓం ఐం హ్రీం శ్రీ లం మాంసాంత్మనే నమః - కకుది
ఓం ఐం హ్రీం శ్రీ వం మేద ఆత్మనే నమః - వామాంసే
ఓం ఐం హ్రీం శ్రీ శం అస్థ్యాత్మనే నమః - హృదయాదిదక్ష కరగ్రాంతం
ఓం ఐం హ్రీం శ్రీ షం మజ్జాత్మనేనమః - హృదయదాదివామకణగ్రాంతం
ఓం ఐం హ్రీం శ్రీ సం శుక్రాత్మనే నమః-హృదయాది దక్షపాదాంతం
ఓం ఐం హ్రీం శ్రీ హం ఆత్మనే నమః - హృదయాది వామపాదాంతం

ఓం ఐం హ్రీం శ్రీ ళం అంతరాత్మనేనమః- హృదయాదిబ్రహ్మరంధ్రాంతం పూర్వోక్త క్రమేన పునః షడంగ న్యాసం కృత్వా

**అంతర్మాతృకాన్యాసం :-**

అస్యశ్రీ అంతర్మాతృకాన్యాస మంత్రస్య - బ్రహ్మఋషిః - గాయత్రీ ఛందః - శ్రీ శుద్ధ మాతృకా సరస్వతీదేవతా - హలోబీజాని - స్వరాశ్శక్తయః -బిందవః కీలకం - అంతర్మాతృకాన్యాసే వినియోగః॥

అం కం ఖం గం ఘం ఙం ఆం అంగుష్ఠాభ్యాంనమః హృదయాయ నమః
ఇం చం ఛం జం ఝం ఞం ఈం తర్జనీభ్యాంనమః శిరసే స్వాహా
ఉం టం ఠం డం ఢం ణం ఊం మధ్యమాభ్యాం నమః శిఖాయైవషట్
ఏం తం థం దం ధం నం ఐం అనామికాభ్యాం నమః కవచాయహుం
ఓం పం ఫం బం భం మం ఔం కనిష్ఠికాభ్యాం నమః నేత్రత్రయాయవౌషట్
అం యం రం లం వం శం షం సం హం కరతలకరపృష్ఠాభ్యాం నమః
ళం క్షం అః అస్త్రాయఫట్
భూర్భువస్సువరోమితి దిగ్బంధః ॥

**ధ్యానం :-**

**శ్లో॥ ఆధా రేలింగానాభౌ హృదయసరసిజే తాలుమూలే లలాటే ।**
**ద్వేపత్రే షోడశారే ద్విదశ దశదళే ద్వాదశార్ధే చతుష్కే ।**
**వాసాంతే బాలమధ్యే డఫ కఠ సహితే కంఠమూలే స్వరాణాం ।**
**హంక్షం తత్వార్థ వర్ణయుక్తం సకల దళగతం వర్ణరూపం నమామి॥**

హృదయాంతరస్థిత పరమాత్మ రూపం ధ్యాత్వా మానసోపచారై స్సంపూజ్య॥

(ఈ క్రింది తెలుపు విధముగా శరీరాంతర్గతమగు షట్చక్రముల యందలి ఆయా వర్ణస్థానములలో తెలుపబడిన మాతృకలను భావన జేయవలెను)

1. కంఠస్థానమునందుగ్గల విశుద్ధచక్రము - పదునారు దళములు గలది. తూర్పు మొదలు ప్రదక్షిణక్రమంలో వరుసగా ప్రతి దళమునందు అకారాది అః కారాంతం షోడశస్వరములను భావించవలెను.



ఓం ఐం హ్రీం శ్రీం అం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఆం నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఇం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఈం నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఉం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఊం నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఋం నమః ఓం ఐం హ్రీం శ్రీం ౠం నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఌం నమః ఓం ఐం హ్రీం శ్రీం ౡం నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఏం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఐం నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఓం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఔం నమః
ఓం ఐం హ్రీం శ్రీం అం నమః ఓం ఐం హ్రీం శ్రీం అః నమః

2. హృదయస్థానమునందలి అనాహత చక్రము - పదిరెండు దళములుగలది తూర్పు మొదలు వరుసక్రమంలో ప్రతిదళంలోను కకారాది ఠకారాంత వ్యంజనములను బిందుయుక్తముగా భావించ వలెను.

ఓం ఐం హ్రీం శ్రీం కం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఖం నమః
ఓం ఐం హ్రీం శ్రీం గం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఘం నమః
ఓం ఐం హ్రీం శ్రీం జం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఛం నమః
ఓం ఐం హ్రీం శ్రీం ఝుం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఞం నమః
ఓం ఐం హ్రీం శ్రీం టం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఠం నమః

3. నాభిస్థానమునందుగలది మణిపూర చక్రము-ఇందు పది దళము లుండును. తూర్పు మొదలు వరుసగా ప్రదక్షిణక్రమంలో డకారాది ఫకారాంత మాతృకలను బిందుయుక్తముగా భావన జేయవలెను.

ఓం ఐం హ్రీం శ్రీం డం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఢం నమః
ఓం ఐం హ్రీం శ్రీం ణం నమః ఓం ఐం హ్రీం శ్రీం తం నమః
ఓం ఐం హ్రీం శ్రీం థం నమః ఓం ఐం హ్రీం శ్రీం దం నమః
ఓం ఐం హ్రీం శ్రీం ధం నమః ఓం ఐం హ్రీం శ్రీం నం నమః
ఓం ఐం హ్రీం శ్రీం పం నమః ఓం ఐం హ్రీం శ్రీం ఫం నమః

4. లింగస్థానమునందుగలది స్వాధిష్ఠానచక్రము - ఇందు ఆరు దళములు గలవు. తూర్పుమొదలు వరుసగా ప్రదక్షిణ క్రమంలో బకారాది లకారాంత మాతృకలను బిందుయుక్తముగా భావనజేయవలెను.

ఓం ఐం హ్రీం శ్రీం బం నమః ఓం ఐం హ్రీం శ్రీం భం నమః
ఓం ఐం హ్రీం శ్రీం. మం నమః ఓం ఐం హ్రీం శ్రీం యం నమః
ఓం ఐం హ్రీం శ్రీం రం నమః ఓం ఐం హ్రీం శ్రీం లం నమః

5. గుద-లింగములకు మధ్యభాగమందుండునది మూలాధారచక్రము. ఇందు నాల్గు దళములందును తూర్పుమొదలు వరుసగా ప్రదక్షిణము క్రమంలో వకారాది సకారాంత మాతృకలను బిందుసహితముగా భావనజేయవలెను.

ఓం ఐం హ్రీం శ్రీం వం నమః ఓం ఐం హ్రీం శ్రీం శం నమః
ఓం ఐం హ్రీం శ్రీం షం నమః ఓం ఐం హ్రీం శ్రీం సం నమః

6. భ్రూమధ్యస్థానమున నుండునది ఆజ్ఞానచక్రము. ఇది రెండు దళములుగలది. దక్షిణ వామక్రమంలో హం (ళం) క్షం అను మాతృకలను బిందుయుక్తముగా భావించవలెను.

ఓం ఐం హ్రీం శ్రీం హం నమః ఓం ఐం హ్రీం శ్రీం ళం నమః
ఓం ఐం హ్రీం శ్రీం క్షం నమః

7. బ్రహ్మరంధ్రస్థానమున నుండునది సహస్రార చక్రము -సర్వమాతృకా స్వరూపము. మాతృకల నన్నిటినీ బిందుయుక్తముగా ఆస్థానమునందు ధ్యానించి భావనజేయవలయును.

ఓం ఐం హ్రీం శ్రీం అం నమః మొదలు
ఓం ఐం హ్రీం శ్రీం క్షం నమః వరకు

1. మూలాధారమునందు వరదా-శ్రియా షండా-సరస్వతీ దేవతాత్మకమైన సాకినీ దేవతను ఐదుముఖములు నాల్గు భుజములు కల్గి ఎరుపు, పసుపు, తెలుపు, వర్ణములు గలదానిగా ధ్యానించవలెను.
2. స్వాధిష్ఠాన చక్రమునందు బందినీ, భద్రాకాళీ, మహామాయా, యశశ్వినీ రమాలంబోష్ఠీ దేవతాత్మకమైన కాకినీ దేవతను నాల్గు ముఖములు, రెండు భుజములు కల్గి పీతవర్ణముగలదానిగా ధ్యానించవలెను.
3. మణిపూర చంక్రమునందు డామరీ, ధంకారిణీ, ణామరీ, తామసీ, స్థాన్వి, దాక్షాయణి, ధాత్రి, నందా, పార్వతి, ఫట్కారిణీ దేవతాత్మకమైన



లాకినీ దేవతను, మూడుశిరములు. చతుర్భుజములు కలిగి ఎరుపురంగు గలదానిగా మణిపూర చక్రస్థానమునందు ధ్యానించవలెను.

4. అనాహత చక్రమునందు కాళరాత్రి, ఖాతీత, గాయత్రీ, ఘంటాధారిణి, జామిని, చండా, ఛాయా, జయా, ఝంకారీ, జ్ఞానరూపా, టంకహస్తా ఠంకారిణీ దేవతాత్మకమైన రాకినీదేవత (వామదేవి మరొకనామము) రెండు శిరములు, నాల్గుభుజములు కలిగిన శ్యామవర్ణముగల దానినిగా అనాహత చక్రస్థానమునందు ధ్యానించవలెను.
5. విశుద్ధి చక్రమునందు అమృతా, ఆకర్షణి, ఇంద్రాణి, ఈశాని, ఉష, ఊర్ధ్వకేశి, ఋద్ధిదా, ఋకారా, కా, ఏకపదా, ఐశ్వర్యా ఓంకారీ, ఔషధీ, అంబికా, అక్షరా యను దేవతాత్మకమైన డాకినీ దేవతను,(వజ్రేశ్వరీ మరొకనామము) ఒకేశిరము, నాల్గు హస్తములు, ఖట్వాంగ, ఖడ్గ, త్రిశూల, చర్మములను ఆయుధములు కల్గి, తెలుపు-ఎరుపు రంగులుగలదానిగా విశుద్ధ చక్రస్థానమునందీ దేవిని ధ్యానించవలెను.
6. ఆజ్ఞాచక్రమునందు-హంసవతి, క్షమాయను ద్విదేవతాత్మకమైన హాకినీ దేవతను (సిద్ధమాత మరొకనామము) ఆరుశిరములు, నాల్గు భుజములు కల్గి తెల్లని వర్ణముగల దానినిగా ఆజ్ఞచక్రస్థానమునందు ధ్యానించవలెను.
7. సహస్రార చక్రమునందు - పైన దెలుపబడిన సర్వచక్రముల యందలి దేవతాత్మకమైన యాకినీదేవతను (యశస్విని మరొక పేరు) సహస్ర శిరములు (అనంత శిరములు) అనంతమైన బాహువులు, సర్వాయుధములు, సర్వవర్ణములకల్గి సర్వదేవతా స్వరూపముగల దానినిగా బ్రహ్మరంధ్ర స్థానమునందు ధ్యానించవలెను.

ఈవిధముగా ఆయా స్థానములందు ఆయా బీజాక్షరయుక్తమగు దేవతలను ధ్యానించుటను సాధారణలక్షణముగా పేర్కొనవచ్చును. విశేషలక్షణముగల అంతర్మాతృకాన్యాసము గావించుటకు యోగశాస్త్రానుభవము, యోగసిద్ధి చాలా అవసరము. సంప్రదాయానుసారము ఈ

దెలుపబడిన దశవిధ మంత్రాంగములను జరుపనియెడల ఎట్టి మంత్రమైనను సిద్ధించి ఫలించుట చాలా కష్టము. సద్గురువు నాశ్రయించి వారి అనుగ్రహముబడసి దీక్షాయుక్తముగా మంత్రోపదేశమునుండి శాస్త్రము నిర్ణయించిన విధముగా దీక్షానియమములు, ఆచారవ్యవహారములు పాటింపుచు గురుని ఆజ్ఞప్రకారం మంత్రశాస్త్ర సాంప్రదాయములు పాటింపుచు, స్థిరచిత్తులైన మంత్రమును జపించువారికి దేవతాప్రసన్నము కరతాలామలకము కాకతప్పదు.



మంత్రము ననుష్ఠించుటకు ముందు ఆ మంత్రముయొక్క సమగ్ర స్వరూప-స్వభావములను తెలిసికొనుట చాలా ముఖ్యము. "జ్ఞాత్వా కుర్వీతకర్మాణి" యని శాస్త్రవచనము. తానాచరించు ఏకర్మనైనను పూర్తిగా తెలుసుకొనియే ఆచరించవలెను. అట్లుగాకున్న ఆ యాచరించు కర్మలు ఫలించవు మరియు ఆకర్మాచరణమువలన ఇహలోకసుఖము గానీ, పరపుణ్య ఫలానుభవముగానీ లభించవు. కావున ఇహ పర ఫలదాయకమగు "మంత్రానుష్ఠానము" ఏ విధమగు స్వరూప - స్వభావ - ప్రవృత్తులు కలిగియున్నదను సమగ్రవిషయమును గురువుద్వారా తెలుసుకొనుట అవసరము. సాధకుల అవగాహనకొరకు మంత్రానుష్ఠానమును గురించి అందలి విశేషములను గురించి సంక్షిప్తముగా వివరించంబడుచున్నది. (పూర్తి విషయములను గురువుముఖముగా తెలుసుకొనవలయును.)

ప్రతి మంత్రమునకు ఋషి ఛందోదేవతా బీజశక్తికీలక వినియోగములను ఆరు అంగము లుండగలవు. ఈ మంత్రాంగములయొక్క ఉపయోగము దెలియని వారికి మంత్రానుష్ఠానము ఫలించదని శాస్త్రప్రమాణము.

శ్లో॥ ఆర్షం ఛందశ్చ దైవత్యం వినియోగ స్తథైవచ ।
వేదితవ్యం ప్రయత్నేన బ్రాహ్మణేన విశేషతః ॥
అవిజ్ఞాతు యః కుర్యా ద్యాజనాధ్యాపనాదికం ।
హోమం తర్పణాదీని తస్య చాల్పఫలం భవేత్ ॥ (యాజ్ఞవల్క్య)



శ్లో॥ పూర్వోక్తేన ప్రకారేణ ఋష్యాదీ న్వేత్తియో ద్విజః ।
అధికారో భవేత్తస్య రహస్యాదిషు కర్మసు ॥

పైవిధముగా మంత్రాంగముల ప్రయోజనమును దెలిసికొనుట మంత్రసాధకుల కవస్యకర్తవ్యము. మంత్రాంగము నెరుంగని సాధకులు ఆచరించు అనుష్ఠానము, హోమము, తర్పణము, దేవపఠనము, యజ్ఞము మొదలగువన్నియు ఫలవంతములు కానేరవు. మరియు మంత్రాంగ విజ్ఞాన రహితులికా కర్మలయందు దధితరముకూడా ప్రాప్తించదు.

**1. ఋషి :-**

శ్లో॥ యేన యదృషిణాదృష్టం సిద్ధిః ప్రాప్తా చ యేనవై ।
మంత్రేణ తస్య తత్ప్రోక్త మృషే భావ స్తదార్షకమ్ ॥

ఒకానొక దేవత నుద్దేశించి యుక్తము, యోగ్యమునగు విధముగా అక్షరమును విహిత శబ్దరూపముగా రూపొందించినవాడు ఋషి మరియు ఆ ఋషి అట్లు రూపొందించిన మంత్రమును ఆర్షసాంప్రదాయాను సారముగా అనుష్ఠించి-సిద్ధిపొంది (దేవతాసాక్షాత్కారమునంది) ఆ యొక్క తపఃఫలమును విశ్వకళ్యాణమునకు వెచ్చించి యుండుటవలన మంత్రమునకు ఋషి మూలపురుషు డనబడును. ఏ ఋషి ప్రోక్తమగు మంత్ర మా ఋషియొక్క కల్పముగా దెలుపబడి ఆ కల్పమునందు దెలుపబడిన సాధనా నియమ సాంప్రదాయములకు లోబడి యుండగలదు.

**2. ఛందస్సు :-**

శ్లో॥ ఛాదనా చ్ఛంద ఉద్దిష్టం వాససీ ఇవి చాకృతే ।
ఆత్మా సంఛాదితో దేవై ర్మృత్యో ర్భీతైస్తువై పురా ॥

శరీరమును వస్త్రము లెట్లు కప్పియుంచునో అదేవిధముగా మంత్రములను గప్పియున్నవి ఛందస్సులు పూర్వము మృత్యుభీతిని జెందిన దేవతలను ఆత్మ అచ్ఛాదించినది. ఆత్మకు ప్రతిరూపము ఛందములు. దేవతలకు ప్రతిరూపములు మంత్రములు. కావున మంత్రములను గప్పియున్న ఛందస్సును దాని స్వరూపమును దెలియనివారికి మంత్రానుష్ఠానమునందు ఇతర మంత్రయుక్త విషయములందు దేవతానుగ్రహము కల్గుట దుర్లభము.

ఛందస్సులు మొత్తము 26. (పరమార్థ ప్రతిపాదికములైన కొన్ని ఛందస్సులు వేరుగలవు)

1. ఉక్త 2. అత్యుక్త 3. మధ్య 4. ప్రతిష్ఠ 5. సుప్రతిష్ఠ 6. గాయత్రి 7. ఉష్ణిక్కు 8. అనుష్టుప్ 9. బృహతీ 10. పంక్తి 11. త్రిష్టుప్ 12. జగతి 13. అతిజగతి 14. శక్వరి 15. అతిశక్వరి 16. అష్టి 17. అత్యష్టి 18. ధృతి 19. అతిధృతి 20. కృతి 21. ప్రకృతి 22. ఆకృతి 23. వికృతి 24. సుకృతి 25. అతికృతి 26. ఉత్కృతి.

ఉక్తమొదలు వరుసక్రమంలో ఎంత సంఖ్యగల ఛందమో ఆఛందముతో గూడిన మంత్రపాదము అన్ని అక్షరములు కలిగియుండగలదు.

ఉదాహరణ:- గాయత్రీ మంత్రమునకు గాయత్రీ ఛందస్సు. ఇది ఆరవ ఛందము కావున గాయత్రీ మంత్రమునందలి ప్రతిపాదము 6 అక్షరములు కల్గి నాల్గుపాదములు (4×6=24) ఇరువది నాల్గక్షరములుగానున్నది. వేదమునందు చంద్రునికి దెల్పిన "ఆప్యాయస్వసమేతుతే" అను మంత్రముకూడా 24 అక్షరములు కల్గి గాయత్రీ ఛందస్సుతో నున్నది.

కొన్ని సందర్భములలో మంత్రాక్షరములకు పైనదెలుపబడిన ఛందస్యంఖ్యకు సంబంధ ముండకపోవచ్చు. సౌభాగ్య విద్యాపంచదశాక్షరీ మంత్రము పదిహేను అక్షరములుగలది. దీనికి పంక్తిఛందము. అనగా మంత్రపాద మొకటికి పది అక్షరములుండవలెను. కానీ మొత్తం మంత్రమే 15 అక్షరములుగలది. ఇది 4చే గానీ, 10చే గానీ విభజించుటకు వీలులేదు. కావున ఈ మంత్రము నందలి అక్షరములకు - మంత్రఛందమునకు సంబంధములేక యున్నది. అయినను మంత్రశాస్త్రము దెల్పిన విధముగా పంక్తి ఛందమునే ఈ మంత్రమునకు జెప్పవలెను. (ఇది సార్థపాద మంత్రము) కావున ఛందోబద్ధముగాని మంత్రములు సాంప్రదాయ విరుద్ధములని పరిత్యజింపక ఈ మంత్రములను-అందలి విశేషములను సద్గురువులద్వారా తెలుసుకొని మంత్రముల ననుష్ఠించవలెను. కొన్ని సందర్భములలో గురు సాంప్రదాయాను గుణ్యముగా ప్రధాన మంత్రములయందు కొన్ని ప్రత్యేక ఫలితములు సిద్ధించుటకొరకు ఇతర బీజాక్షరములు నిర్ణీతస్థానములందు సంధించుట (కలుపుట) కూడా యుండగలదు.



**3. దేవత :-**

**శ్లో॥ యస్యయస్యతు మంత్రస్య ఉద్దిష్టాదేవతామయా ।**
**తదాకారం భవేత్తస్య దేవత్వం దేవతోచ్యతే ॥**

అనేకకోట్ల విధములుగా విస్తరించబడిన మంత్రములలో ప్రతి మంత్రము ఒక దేవతాశక్తి కలిగి (సగుణోపాసనయందు) ఆ మంత్రము ఆదేవతాత్మకమై యుండగలదు. మంత్రమున కాధిపత్యముగల దేవత యొక్క వర్ణ, ఆయుధ, రూపములనే సదా ధ్యానించును-ఆ దేవతారూపమును హృదయమునందు స్థిరముగా నెలకొల్పి మంత్రానుష్ఠానమును జరుపవలెను. (దేవతయొక్క వర్ణ, ఆయుధ, రూప, వర్ణనమేధ్యానము)

**4. బీజము :-**

**శ్లో॥ దేవతాయాః పరం రూపం బీజేనైన వచ సూక్ష్మకం**
**తద్బీజముత్త మాంగం చ మంత్రాణాం మంత్ర కోవిదైః॥**

దేవతల నంతశక్తికల్గిన కామరూపులు. మంత్రధ్యానమునందు పేర్కొనబడిన వారి విశేషరూపము ఒకానొక నిర్ణయించబడిన బీజాక్షరమునందు సూక్ష్మరూపమున నిబిడీకృతమై మంత్రము మనస్సుతో సంగమించు నప్పుడు మహద్రూపమునుజెంది సాధకుని ఫలసిద్ధికి-దేవతానుగ్రహమునకు కారణము కాగలదు - ఈ బీజము మంత్రముయొక్క శిరోస్థానముగా దెలుపబడినది. శిరోబీజము, మంత్రశిర స్థానబీజము అనికూడా దీనికి నామములు గలవు.

అతి చిన్నదగు విత్తనమును భూమియందు నాటిదానికి వలయు సంస్కారములను గావింపుచుండిన ఆ విత్తనము మొక్కగా మొలకెత్తిపెరిగి, పెద్దదై చక్కని ఫలపుష్పముల నొసంగు విధముగానే మంత్రబీజమును హృదయమునందునాటి నిరంతర సాధన గావింపుచుండిన అది దివ్యమగు దేవతాశక్తిని ఆవిర్భవింపజేసి తద్వారా సాధకునికి కావలసిన ఫలితముల నొసంగును.

మాతృకలలో స్వరములు, వ్యంజనములు, (అచ్చులు-హల్లులు) అని రెండు విధములు, స్వరములు సర్వ స్వతంత్రముగలవి. వ్యజనములు స్వరయుక్తము లైనప్పుడు ఫలవంతములు. ఇట్టి స్వరవ్యంజనముల కలయికచే

ఏర్పడునది "బీజము" ఏదేవతకే బీజము ! ఏ బీజమే ఫలదాయకము! అను విషయము లన్నియు మంత్రానుష్ఠానము గావించవలెను. బీజజ్ఞానము లోపించుటవల్ల కొన్ని సమయాలలో విపరీత పరిణామములు కలుగగలవు.

**5. శక్తి :-**

**శ్లో॥ మంత్రాణాం ద్యోతకైః శక్తిం చైతన్యం బీజ దేవతైః ।**
**మంత్రస్య హృదయం శక్తిం సాధకైశ్చ ఫలప్రదా**

ప్రతిమంత్రమునకు చైతన్యమును కలిగించి ఆ మంత్రమును సత్వర ఫలవత్తరము గావించుటకు తోడ్పడునది. "శక్తి" ఇది కూడా బీజాక్షరరూపములో మంత్రమునకు హృదయస్థానమున నుండగలదు. ఇదియే మంత్రమునకు హృదయము ప్రధాన దేవతకు–ఆ దేవతయొక్క బీజమునకు తగిన ఉద్దీపనము కలిగించి సాధకోన్ముఖముగా తీర్చిదిద్దుటలో శక్తియెనలేని ప్రాధాన్యము కలిగియున్నది.

**6. కీలకం :-**

**శ్లో॥ నాభిస్థానే విజానీయాన్మంత్రాణామపి కీలకం ।**
**సాధ్యకర్మాణ్యనే కాని మంత్రమే కేన సాధయేత్ ॥**

మంత్రమునకు కీలకము ప్రాణమువంటిది. ఒకే మంత్రమును పలువిధములగు ఫలితములకొరకుపయోగించుటకే కీలకము ప్రాధాన్యత వహించగలదు. మంత్రము నందలి నాభిస్థానమునం దీ కీలకమును గుర్తింపవచ్చును. మంత్రము వ్యక్తీకరించుటకు వీలులేని విధముగా నున్నప్పుడీ కీలకముద్వారా మంత్రము నందలి చిక్కును విడదీయవచ్చును. కీలకములేని మంత్రము శిరములేని కళేబరము వంటిది.

**వినియోగము :-**

**శ్లో॥ పురాకల్పే సముత్పన్నా మంత్రాః కర్మార్థమేవచ**
**అనేనేదం తు కర్తవ్యం వినియోగః స ఉచ్యతే॥**

పూర్వము. కల్పములలో దెలుపబడిన ఋషిప్రోక్తమువలన మంత్రములచే ఏ కర్మలు సాధించబడుచున్నవో ఆ మంత్రముల కా యా కర్మముల నిర్దేశించుకొనుటయే వినియోగము. అనగా కేవల మోక్షప్రద



మంత్రములకు "మోక్షార్థే" యను వినియోగమును కామ్యప్రద మంత్రములకు "అభీష్టకామ్యార్థే" యను వినియోగమును జెప్పవలెను.

మంత్రానుష్ఠానమునందు ప్రారంభములో సంకల్పము. పిమ్మట వినియోగము మిక్కిలి ప్రాధాన్యత కలిగియున్నది. సర్వసాధారణంగా ప్రతి మంత్రమునకు "మమాభీష్టసిద్ధ్యర్థే జపే వినియోగః" యని జెప్పుఆచారము గలదు. ఈ విధానము మంచిదే అయినను ఒకేఫలితము నాశించి జరుపు జపమునందు సంపూర్ణఫలము ప్రాప్తించుట కవరోధము కాగలదు. అభీష్టమనునది మనస్సునకు సంబంధించిన వృత్తి (చర్య) మనస్సు చంచల స్వభావముగలదై మానవుని మనుగడను క్షణక్షణము అనేకానేక అభీష్టములవైపు (కోరికలవైపు) మరలింపుచుండగలదు. కావున సామూహికముగా "అభీష్టసిద్ధ్యర్థే" యను వినియోగముద్వారా మంత్రఫలము ఆ సాధకునికిగల సమస్త కోర్కెలకు విభజించబడి–ఉద్దేశించిన కర్మకు తగిన శక్తిని సమకూర్చలేక పోవుటచే ఆ కర్మ ఫలించుట దుర్లభము కాగలదు. కావున సర్వఫల వాచ్య కార్థమును వదలి నిర్దిష్టమగు ఒకే కర్మకొరకు వినియోగమును దెలుపవలెను. ఇదే విధముగా ప్రారంభ సంకల్పమునందు కూడా సర్వఫల వాచకములనుగాక ఆశించిన ప్రయోజనము నొక్కటియే, జెప్పుటవలన మంత్రముయొక్క సంపూర్ణఫలము ఒకే విషయమునకు జెంది ఆకార్య సత్వరసిద్ధికి తోడ్పడగలదు.

## షడంగన్యాసము

**శ్లో॥ న్యాసేన నితరాందేహే అసమంత్రో ఉక్షరాణి చ ।**
మనాం కృతిర్జపన్నిత్యం సాధకః సిద్ధిమాప్నుయాత్ ॥

మంత్రాక్షరములను దేహాంగములందు నెలకొల్పుకొని (న్యాసము గావించి) మంత్ర స్వరూపమును నిరంతరము మనస్సునందు జపించవలెను. ఈవిధానముద్వారా సాధకుడు సత్వరసిద్ధిని పొందగలడు. మరియు న్యాసమువలన శరీరముయొక్క బాహ్యేంద్రియములు అంతరింద్రియములు కల్మష రహితములై చలనత్వముడిగి స్థిరత్వము నందగలవు.

బహిర్మాతృకాన్యాసమువలన దేహంగములలోని ముఖ్యస్థానము లన్నియు మంత్రపూరితము గావించబడగలవు. అయితే మూలమంత్రముచే గానీ, మంత్రబీజముచేగానీ, జరుపదగిన కరన్యాస-హృదయన్యాసములు అతిముఖ్యమైనవి. వీటినే షడంగన్యాసముగా మంత్రశాస్త్రము దెల్పుచున్నది. మొదటిదగు కరన్యాసమునందు హస్తము అందలి అంగుళులు (వ్రేళ్ళు) ప్రాధాన్యత వహించి యుండగలవు. అనగా హస్తాంగుళులు, పంచభూతము లకు ప్రతీకలై పంచభూతముల ప్రేరణవల్ల ప్రాప్తించు దేహేంద్రియ సంబంధిత వికారములను సూచించునవైయున్నవి కావున కరన్యాసముద్వారా ఆ పంచభూత ప్రకోపవికారములు సాధకుని దేహేంద్రియములకు ప్రాప్తించ కుండా నిరోధించవచ్చు.

## కరన్యాసము

శ్లో॥ **భూతానాం పంచతత్త్వాన్యం గుష్ఠాది క్రమశోభికేత్ ।**
**మంత్రన్యాసం ప్రకుర్వీత పంచభూతోప శాంతయే ॥**

1. బొటనవ్రేలు–శుక్రగ్రహాధిపత్యము–జలభూతతత్త్వము–కామప్రకోపము
2. చూపుడువ్రేలు–గురుగ్రహాధిపత్యము–ఆకాశభూతతత్త్వము–సుఖప్రకోపము
3. మధ్యవ్రేలు–శనిగ్రహాధిపత్యము–వాయుభూతతత్త్వము–దుఃఖప్రకోపము
4. ఉంగరపువ్రేలు–రవిగ్రహాధిపత్యము–అగ్నిభూతతత్త్వము–ఆత్మప్రకోపము
5. చిటికినవ్రేలు–బుధగ్రహాధిపత్యము–భూభూతతత్త్వము–వాక్ప్రకోపము
6. కరతలము–కరపృష్ఠము–కుజ–చంద్రగ్రహాధిపత్యము–
అగ్ని–జలభూతతత్త్వములు–అహంకార–మనోప్రకోపములు

మం॥అంగుష్ఠాభ్యాంనమః–చూపుడువ్రేళ్ళతో బొటనవ్రేళ్ళునుస్పృశించవలెను
మం॥తర్జనీభ్యాం నమః–బొటనవ్రేళ్ళతో చూపుడువ్రేళ్ళును స్పృశించవలెను.
మం॥మధ్యమాభ్యాంనమః–బొటనవ్రేళ్ళతో మధ్యవ్రేళ్ళను స్పృశించవలెను
మం॥అనామికాభ్యాం నమః–బొటనవ్రేళ్ళతోఉంగరపువ్రేళ్ళనుస్పృశించవలెను.
మం॥కనిష్ఠకాభ్యాంనమః–బొటన వ్రేళ్ళతో చిటికెన వ్రేళ్ళను స్పృశించవలెను.
మం॥కరతలకరపృష్ఠాభ్యాంనమః–ఒక చేతితో మరొకచేతివ్రేళ్ళు చివరిభాగములను పిమ్మట అరచేతి వెనుక భాగములను స్పృశించవలెను–ఇది కరన్యాసము.



## హృదయన్యాసము

శ్లో॥ **వశ్యాది కర్మషట్కాణాం హృదయాదిషడంగకం ।**
**కుర్వీత హృదయన్యాసం షట్కర్మాణి చ సిద్ధయేత్ ॥**

వశ్యము మోహనము, ఆకర్షణ, స్తంభన, విద్వేషణ, మారణ అను ఆరుకర్మలు. హృదయము, శిరము, శిఖ, నేత్రత్రయము, కవచము, అస్త్రము అను ఆరు అంగములకు ప్రతీకలు. కావున మూలమంత్ర యుక్తముగా హృదయాదిన్యాసము గావించిన యెడల వశ్యాది షట్కర్మలు శీఘ్రముగా సిద్ధినందగలవు. (ఏకర్మ నుద్దేశించి చేసిన ఆకర్మ)

మం॥ హృదయాయనమః॥ మొదటి, చివరగల రెండువ్రేళ్ళవదలి మధ్యగల మూడు వ్రేళ్ళుచే హృదయమును దాకవలెను.

మం॥ శిరసే స్వాహా॥ మధ్యవేలు–ఉంగరపువ్రేళ్ళ రెంటిచే శిరస్సును దాకవలెను

మం॥ శిఖాయైవషట్॥ బొటనవ్రేలిచే శిఖను తాకవలెను

మం॥ కవచాయహుం॥ కుడిచేతి అన్ని వ్రేళ్ళసంపుటిచే ఎడమభుజమును అదేవిధముగా ఎడమచేతివ్రేళ్ళు సంపుటిచే కుడి భుజము తాకవలెను.

మం॥ నేత్రత్రయామవౌషట్॥ మధ్యనున్న మూడువ్రేళ్ళచే నేత్రములను తాకవలెను.

మం॥ అస్త్రాయఫట్॥ చూపుడువ్రేలు– మధ్యవ్రేళ్ళ రెంటిచే అస్త్రమున్యసించవలెను.

దిగ్బంధము :– ఓం భూర్భువస్సు వరోమితి దిగ్బంధః॥
రెండు హస్తములందలి మధ్యవ్రేళ్ళను అభిముఖముగా మెలివేయవలెను.

శ్లో॥ **న్యాసం వినాకృతా మంత్రక్రియాః సర్వ వినిష్ఫలాః**
**తస్మా న్న్యాసః ప్రకర్తవ్యో మంత్రాగత ఫలేప్సుభిః ॥**

న్యాసరహితముగా చేసిన మంత్రజపము నిష్ఫలముకాగలదు. మంత్రజపమువల్ల ఫలితమును పొందగోరెడివారు తప్పక న్యాసక్రియలను జరుపవలెను. ఈ షడంగన్యాసమును (మంత్ర) జప ప్రారంభమునందు,

జపసమాప్త యందును ఆచరించెడి సాంప్రదాయముకలదు. కొందరు ప్రారంభమునందు కరన్యాస (అంగుళీన్యాసం) హృదయన్యాసములను జపసమాప్తమునందు కేవల హృదయన్యాసమును జరుపుచుండెదరు. అది వారి గురుసాంప్రదాయము ననుసరించి నిర్ణయించబడును.

**ధ్యానము :-**

**శ్లో॥ అథవా నిష్కళం ధ్యాయే త్సచ్చిదానంద లక్షణం ।**
**సర్వ తేజోమయం ధ్యాయే త్సచరాచ రవి గ్రహమ్ ॥**

ధ్యానమనునది మంత్రాధిష్ఠిత దేవతయొక్క రూప, గుణ వర్ణనమును తన హృదయ కమలమునందు ప్రతిష్ఠించు క్రియ, మోక్షార్థులగు వారు రూపగుణ రహితమైన సచ్చిదానంద తేజస్సును మాత్రమే హృదయ ప్రతిష్ఠ మొనర్చెదరు. కామ్యార్థులు సర్వతేజోమయము-చరాచర వ్యాసకమునగు మంత్రాధి దేవతయొక్క దివ్యరూపమును తమ హృదయకమలమునందు నిల్పి-మంత్రమును జపించవలెను. ధ్యానము నిలువనిదే ఎంత జపించినను ఫలముండదు. చిత్తస్థిరత్వమువల్లగానీ ధ్యానము సిద్ధించదు. కావున మంత్రానుష్ఠాన రతులగువారు విశేషకృషి యొనర్చి యైనను చిత్తస్థిరత్వమును సాధించి ధ్యాననిష్ఠను పొందవలెను. దృఢతరమగు భక్తి విశ్వాసమువల్ల దేవతానుగ్రహము-దైవానుగ్రహమువల్ల గురుకటాక్షము, గుర్వనుగ్రహమువల్ల యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన సమాధులను అష్టాంగయోగములు, వాటిద్వారా ఉపాస్య దేవతా సాక్షాత్కారములు సాధకులకు ప్రాప్తించగలవు. క్రమమగు ఆధ్యాత్మిక జీవనవిధానము లేక - తాత్కాలిక ఉద్రేకంతో పుస్తకములు చూచియు- ఎవరో చెప్పగా వినియు ఆచరించు మంత్రములు ఫలించవు. విధినియమోల్లంఘనమువల్ల పాపము, అపాయము, దుఃఖము కూడా కలుగగలవు.

**పంచోపచారములు :-**

ధ్యానానంతరము జరుపదగినవి పంచోపచారములు, పృథ్విజల వాయురాకాశ తేజస్సులనునవి పంచభూతములు, వీటికి సంబంధించిన బీజాక్షరములచే తన ధ్యానదేవతకు గంధపుష్ప ధూపదీప నైవేద్యములను పంచోపచారములను సమర్పించవలెను. ఈ పంచోపచారములను



మనస్సునందు భావించుటద్వారా జరుపవలెనని కొందరు (సంప్రదాయములు) ప్రత్యక్ష ద్రవ్యములచే జరుపవలెనని కొందరు దెల్పుచున్నారు. కొందరు భావనామాత్రముగా ఉదకమును సమర్పించు పద్ధతికలదు. ముఖ్యమగు మంత్రశాస్త్ర గ్రంథములందు ముద్రాప్రదర్శన యుక్తమగు భావనయే ప్రధానమని దెలియుచున్నది. హస్తమునందలి ఐదు అంగుళులు (వేళ్ళు) పంచభూతములకు ప్రతీకలగుటవలన ఆవ్రేళ్ళయొక్క పరస్పర కలయికద్వారా ఏర్పడుముద్రను ప్రదర్శించి భూతబీజము నుచ్చరించి దేవతకొరకు ఉపచారమును భావన జేయవలెను.

**శ్లో॥ య కారం ప్రాణబీజం చ నీలజీమూత సన్నిభం ।**
**ర కారం మగ్నిబీజం చ అపానాదిత్య సన్నిభం॥**
**ల కారం పృథివీరూపం వ్యానబంధూక సన్నిభం ।**
**వ కారం జీవబీజం చ ఉదానం శంఖ వర్ణకం ॥**
**హ కారం వియత్స్వరూపం చ సమానం స్ఫటిక ప్రభమ్**

**(ధ్యానబిందూపనిషత్)**

లం పృథివీ తత్త్వాత్మనే గంధం పరికల్పయామి -(గంధం సమర్పణముభావన)
చిటికిన వ్రేలు - బొటనవ్రేలు కలిపి పైకి జూపవలెను-
(దీనిని వ్యాసముద్ర యందురు)

హం ఆకాశతత్త్వానే పుష్పం పరికల్పయామి-(పుష్పసమర్పణము భావన)
బొటనవ్రేలు - చూపుడువ్రేలు కలిపి క్రిందకు జూపవలెను-
(దీనిన సమానముద్ర యందురు)

యం వాయుతత్త్వాత్మనే ధూపం పరికల్పయామి -(ధూపసమర్పణము భావన)
చూపుడువ్రేలు-బొటనవ్రేలు కలిపి పైకి జూపవలెను-
(దీనిని ప్రాణముద్ర యందురు.)

రం తేజో తత్త్వాత్మనే దీపం పరికల్పయామి - (దీపసమర్పణ భావన)
మధ్యవ్రేలు-బొటనవ్రేలు కలిపి పైకిజూపవలెను-
(దీనిని ఆపానముద్ర యందురు)

వం అమృత తత్త్వాత్మనే అమృతోపహారం పరికల్పయామి-
(మధురాహార సమర్పణము భావన)

ఉంగరపువ్రేలు-బొటనవ్రేలు కలిపి పైకి జూపవలెను-

(దీనిని ఉదానముద్ర యందురు)

సం సర్వతత్త్వాత్మనే సర్వోపచారాన్ పరికల్పయామి -

(సర్వోపచార పూజాసమర్పణము భావన)

రెండుచేతులయొక్క వ్రేళ్ళతో (దోసిలివలె) అంజలి జూపవలెను.

(దీనిని సర్మాతనాముద్ర యందురు)

**గురుధ్యానమ్ (వందనము) :-**

శ్లో॥ **గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షత్పరబ్రహ్మా తస్మై శ్రీ గురవేనమః ॥**

దేవతయందు అదియొక భ్రాంతి, లేక రాయి, చిత్రపటము అనుభావనము, మంత్రమునందు అవి కొన్ని అక్షరములచే ఏర్పడిన శబ్దములను భావనయు, గురువునందు అతడొక పండితుడు-లేక మానవుడను భావనయు కల్గియున్నయెడల అట్టివారాచరించు మంత్రములు ఫలించకపోగా వారికి ఘోరమగు నరకము ప్రాప్తించగలదని "కులార్ణవ తంత్రము" అను గ్రంథము దెల్పుచున్నది.

శ్లో॥ **గురౌ మనుష్యబుద్ధిం చ మంత్రే చాక్షర బుద్ధినామ్ ।**
**ప్రతిమాసు శిలాబుద్ధిం కుర్వాణోనరకం వ్రజేత్ ॥**

గురువు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రిమూర్తులయొక్క స్వరూపముగాను సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపముగాను భావింపుచుండవలెను. గురువుకు, దేవతకు, మంత్రమునకు భేదముండదు. ఆ మూటినీ ఒక్కటి గానే సాధకుడారాధించవలెను.

గురువుయొక్క రూపమును మనస్సున ధ్యానించి నమస్కారము గావించవలెను. గురు వందనముతోబాటు పరమగురువు (గురువుయొక్క గురువు) పరమేష్ఠి గురువులకు (గురుని గురువుయొక్క గురువు) కూడా నమస్కరించవలెను.

ఓం ఐం హ్రీం శ్రీం హంసశ్శివస్సోఽహం స్వరూపనిరూపణహేతవే
స్వగురవేనమః



స్వగురు శ్రీ... ....శ్రీపాదుకాం పూజయామి నమః॥

(తన గురువును ధ్యానించవలెను)

ఓం ఐం హ్రీం శ్రీం సోఽహం హంసశ్శివః స్వచ్ఛ ప్రకాశ
విమర్శహేతవే పరమగురవే నమః॥

పరమగు శ్రీ... ....శ్రీపాదుకాం పూజయామి నమః॥

(గురువుయొక్క గురువును ధ్యానించవలెను)

ఓం ఐం హ్రీం శ్రీం హంసశ్శివ స్సోఽహం హంసః స్వాత్మారామ పంజర
విలీన హేతవే పరమేష్ఠి గురవేనమః॥

పరమేష్ఠిగురు శ్రీ.... ....శ్రీ పాదుకాం పూజయామి నమః॥

(పరమగురుని గురువును ధ్యానించవలెను)

**జపమాల :-**

శ్లో॥ **రుద్రాక్ష శంఖ పద్మాక్ష పుత్రజీవక మౌక్తికైః ।**
**స్ఫాటికైర్మణి భీరత్నైః సౌవర్ణై ర్విద్రమైస్తథా**
**కుశైః పర్వైర్ద్వాదశస్సు గృహస్థే స్యాక్ష మాలికాః॥**

మూలమంత్రమును క్రమబద్ధముగా జపించుటకు జపమాల చాలా అవసరము. రుద్రాక్షలు, శంఖములు, తామరపూసలు, పుత్రజీవిగింజలు, ముత్యములు, స్ఫటికములు, మణులు, రత్నములు, బంగారుపూసలు, పగడములు, దర్భముడులు, కరపర్వములు (వ్రేలికణుపులు) అను పదిరెండు విధములగువానిలో నేదోనొకదానిచే జపమాలను ఏర్పాటుచేసికొనవలెను. ఈ మాలలోని పూసలసంఖ్యకూడా!

శ్లో॥ **అష్టోత్తర శతామాలా తత్రస్యాదుత్తమోత్తమా ।**
**శత సంఖ్యో త్తమా మాలా పంచ శన్మధ్యమామతా॥**
**చతుః పంచాశతో యద్వా అథమా నప్తవింశతి ।**
**అధమా పంచవింశత్యా యదిస్యా చ్ఛుభ నిర్మితా॥**

జపమాల యందలి పూసలు 108 యుండుట ఉత్తమోత్తమము 100 పూసలు ఉత్తమము. 54 గానీ 50 గానీ పూసలు మధ్యమము. 27 లేక 25 పూసలమాల అధమము. సాధకులు తమ అభిమతానుసారము గృహస్థులకు యోగ్యముగా దెలుపబడిన పై పదిరెండు రకములుగల పూసలను

మాలగజేసికొని ఆ మాలకు మాలాసంస్కారము జరిపి ఇతరులకు కనుపించని విధముగా ఆ మాలనుంచి ప్రతినిత్యము మంత్రజపమునుచేయుచుండవలెను.

**జపము:-**

మూలమంత్రముయొక్క అర్థమును, మంత్రదేవతయొక్క రూపవర్ణనమును గురువుద్వారా తెలిసికొని నెమ్మదిగా-అర్థయుక్తముగా మంత్రమును పలుకుచు మనస్సు నేకాగ్రబరచి-మంత్రదేవతయందే నిమగ్న మొనర్చి, మంత్రము నుచ్చరించిన ప్రతిమారు మాలయందలి ఒకపూసను తన కభిముఖముగా ద్రిప్పవలెను. మాలలోని పూసలకు చూపుడువ్రేలు తగులరాదు. అంగుష్ఠ, మధ్యమ, అనామికలద్వారానే పూసలను ద్రిప్పవలెను. వ్రేళ్ళు పైకుండునట్లుగా మాలనుపట్టుకొని ఒక్కొక్కమారు పూసను తన కభిముఖముగా ద్రిప్పుచు మేరువువద్ద (కొలికిపూస) మాలను తిరిగి వెనుకకు త్రిప్పవలెనేగానీ మేరుపూసను దాటకూడదు. జపసమయమునందు మాలజారిపడుటదోషము. మరియు జపసమయమునందు ఊగరాదు. అందువలన ఏకాగ్రతకు భంగమువాటిల్లి మనసు అన్యచింతనపైకి మరల గలదు. జపమొనర్చునప్పుడు, ఉమ్మివేయుట, ఆవలించుట, దగ్గుట, తుమ్ముట, ఆపానవాయువు విడచుట కూడదు. ఇతరులతో మాట్లాడరాదు. ఇతరులను చూడరాదు. మంత్రశబ్దార్థధ్వనినిగాక ఇతరమగు ధ్వనిని, మాటలను వినరాదు. వీనిలో ఏదోషము సంభవించినను జపమును ఆపి పాదప్రక్షాళనముగావించి, సూర్యదర్శనమొనర్చి తిరిగి ఆచమనము 3 ప్రాణాయామములు, మూలమంత్రముచే షడంగన్యాసము లాచరించి తిరిగి జపము ప్రారంభించవలెను. గురువు, పరమగురువు, తల్లి, తండ్రి, తోడ జపమధ్యమదు మాట్లాడుట దోషముకాదు. వారిని జపమాపియైనను గౌరవించవలెను. అగంతకులైన సాధువులు కూడా గౌరవనీయులేకాగలరు. మాలమధ్యలో నుండగా జపము నాపకూడదు.

శ్లో॥ మంత్రముచ్చారయే ద్వ్యక్తః జపయజ్ఞ సవాచికః॥
కించిచ్ఛ్రవణ యోగ్యః స్యాదుపాంశుః సజపః స్మృతః॥
ధియాయదక్షర శ్రేణీం వర్ణస్వర పదాత్మికాం ।
ఉచ్చరేదర్థ సంస్మృత్యా స ఉక్తోమానసోజపః॥



అందరకు వినిపించు విధముగా ఉచ్చరింపుచు చేయుజపము వాచికము. ఇది అధమజపము. పెదవులు కదిలింపుచు వినివించీ వినపించనట్లుగాచేయు జపము ఉపాంశుజపము. ఇది మధ్యమ ఫలప్రదము. మంత్రము నందలి అక్షరములకు ఆ అక్షరపదములచే ఏర్పడు అర్థమును స్వరభావమును తన మనస్సునందు చింతింపుచు జరుపు జపము మానసికము. ఈ జపము బహు ఉత్తమమైనది. శీఘ్రఫలప్రదము కూడా కాగలదు.

వాచికజపమువలన వాక్శుద్ధి ప్రాప్తించగలదు. ఉపాంశుజపము వలన ఇంద్రియము లదుపుననుండి ఏకాగ్రత లభించగలదు. మానసిక జపమువలన మనోవృత్తులంతరించి సచ్చిదానంద బ్రహ్మానుభూతి-దేవతా సాక్షాత్కారసిద్ధి చేకూరగలవు. అయితే సాధకులకు బహుకాలసాధనవల్లగానీ మానసిక జపమలవడదు. ఈ జపమునందు మనస్సు అన్యవిషయములపై చలించకుండుట చాలాముఖ్యము. మనస్సు వేరొక విషయముపై లగ్నమైయుండి జపమెంతచేసినను, నియమము లెన్ని పాటించినను, అణుమాత్రమైనను ఫలితముండదని గ్రహించవలెను.

## జపభేదములు

శ్లో॥ నిత్యం నైమిత్తికం చైవ కామ్యార్థం ముక్తి రేవచ ।
పంచధా జపభేదస్తు సాధకస్య హితాయవై ॥

నిత్య, నైమిత్తిక, కామ్య, అర్థ, ముక్తి భేదములతో సాధకులు తమ అభీష్టము ననుసరించి జపముచేయవచ్చును. అయితే శాస్త్రచోదితము గురూద్దిష్టమునగు మంత్రసిద్ధిని ముందుగా పొందవలసి వుంటుంది.

**1. నిత్యజపము :-**

ఉపదేశమైన తరువాత తన అవసానదశ వరకు ప్రతిదినము మంత్రమును జపించవలెను. ఉదయ, మధ్యాహ్న, సాయంకాలములందుగానీ లేక ఉదయాస్తమయ కాలములందుగానీ అంతకు శక్తిలేనియెడల ప్రతిదినము ప్రాతఃకాలమునందైనను విడువక తన ఉపాస్య మంత్రమును యధాశక్తిగా

జపించుచుండవలెను. (జాతాశౌచ, మృతాశౌచములు ప్రాప్తించినప్పుడు రోగాదులచే శారీరకాస్వస్థత కల్గినప్పుడు రాజారాష్ట్రాది విప్లవములు కల్గినప్పుడు తాను ఏకారణముచేగానీ రాజశిక్షకు పాత్రుండై చెరసాలయందున్నపుడు జపమును చేయకున్నను దోషమాపాదించదు. మానసికముగా తన మంత్రదేవతను ధ్యానించిన చాలును.

**2. నైమిత్తిక జపము :-**

అర్ధోదయ, మనోదయ, ఉపరాగాది మహాపర్వకాలములందు దేవతాజయంతులు ఉత్సవములందు ప్రత్యేకముగా సమయము ననుసరించి మంత్రజపము జరుపుట విశేష ఫలదాయకము. పుణ్యవృద్ధి అధికముగా నుండగలదు.

**3. కామ్యజపము :-**

ప్రత్యేకమగు నొక కోరిక ఫలించుకొరకు విధినియమముల ననుసరించి కల్పచోదితముగా మంత్రమును జపించవచ్చును. ఇట్టి జపము మండల (40దినములు) అర్ధమండల దీక్షలతో కొనసాగించవచ్చును. మరియు జపసంఖ్య పూర్తికాగలందులకు తన గురు సాంప్రదాయమునకుజెంది మంత్రసిద్ధి పొందిన ఇతరుల సహాయముకూడా తీసుకొని విద్యుక్త విధానముద్వారా కామ్యకర్మలు సిద్ధింపజేసికొన వచ్చును. తనకొరకు కామ్యకర్మయందు పాల్గొనటానికి ఇతరులకు గుర్వాజ్ఞాన సారము దక్షిణాదుల నొసంగవలెను. అట్లువారికి తగిన దక్షిణనీయకున్న ఫలితమును పూర్తిగా పొందుట దుర్లభము కాగలదు.

**4. అర్థజపము :-**

ఇతరులకోర్కెలు నెరవేరుటకొరకు ధనార్జనాధ్యేయముతో పరుల సంకల్పానుసారము వారికొరకు మంత్రమును జపము చేయుట హీనకర్మగా దెలుపబడినది. ఇందువల్ల సాధకునకు మంత్రసిద్ధి కలుగకపోగా పూర్వపుణ్యముకూడా కొంతకొంతగా తరగిపోవుచుండగలదు. సాధకుడు నిత్య-నైమిత్తిక జపతత్పరుడై యున్నప్పుడు మాత్రము అత్యవసర సమయములందు ఇతరులను గురించి జపముచేయుట దోషము కానేరదు.



**5. ముక్తిజపము :-**

తన మనస్సునం దేకోరికయులేక భగవదార్పణముగా నిత్య-నైమిత్తిక జపములు చేయుచుంటుట తత్సంబధితతర్పణ హోమాధికములు జరుపుటవల్ల జ్ఞానియై జన్మాంతరమునందు ముక్తినందగలడు కర్మశేషము ఇంకను మిగిలియున్న యెడల మరుజన్మలో

మహాజ్ఞానియై మంత్రదేవతోపాసన శీఘ్రముగా సిద్ధించి ముక్తి పథమును పొందగలడు.

శ్లో॥ నిష్కామానాం చ భక్తానాం జపహోమాది కార్యతః
ముక్తిరేవ ఫలంతేషా మిహకించి న్న విద్యతే ॥
ఏకస్యైవ విధానస్య నకుత్రాపి ఫలద్వయమ్ ॥

కోరికలు లేకుండా భగవదర్పణముగా ఆచరించు జపహోమాది కర్మలవల్ల ముక్తిమార్గమే లభించునుగానీ ఈ జన్మయం దితర ఫలితములు కలుగవు అని అగస్త్యసంహితయందలి పై ప్రమాణము దెల్పుచున్నది.

## తర్పణము

విద్యుక్తముగా జపము గావించినపిమ్మట ఆ జపసంఖ్యలో పదవ వంతు అదేమంత్రముతో మంత్రదేవతకు గోక్షీరములచే తర్పణ గావించవలెను. కొందరు జపదశాంశము హోమముగావించి హోమసంఖ్యలో పదవవంతు తర్పణగావింపు చుండెదరు. గురుసాంప్రదాయము ననుసరించి ఆచరించుట యుక్తము. కొన్ని కర్మలకు హోమప్రాధాన్యతయు-మరికొన్ని కర్మలు తర్పణ ప్రాధాన్యము కల్గియుండుటవల్ల ఆ యా సందర్భముల ననుసరించి హోమ-తర్పణములు నెరవేర్చవలెను.

తండూలాది ధాన్యరాశియందొక సలక్షణయుక్తమగు పూర్ణకలశమును స్థాపించి దానికి యధోచిత సంస్కారములు జరిపి దాని నిండుగా ఆవుపాలుబోసి చందన-గోరోచనాది సుగంధ ద్రవ్యములనుంచి పూజించవలెను. సంకల్పముగావించి రజితపాత్ర లేక కంచుపాత్రయందు చందన రోచనాదులచే బిందు త్రికోణ షట్కోణములు లిఖించి బిందుమధ్య

మందు మంత్రబీజమును లిఖించవలెను. అట్టి మంత్రదేవతయొక్క అర్చనాయంత్రమునకు ప్రాణప్రతిష్ఠ గావించి దానిపై మంత్రదేవత నావాహన మొనర్చవలెను. పిమ్మట పురుషసూక్త, శ్రీ సూక్తములచే షోడశోపచారములు సలిపి తర్పణకు అనుజ్ఞను కోరవలెను.

**శ్లో॥ దేవదేవ జగన్నాథ సర్వభూతాంతరస్థితా ।**
**అనుజ్ఞాం దేహిమే దేవ పయః తర్పణ కర్మణి ॥** (అనుజ్ఞాప్రార్థన)

పూర్వోక్త అర్చనా యంత్రమునందు మంత్రాది దేవతను భావనజేసి పూర్ణకలశమునందలి ఆవుపాలను కొలది కొలదిగా తన కుడిచేతియొక్క తర్జనీమధ్యమా నామికాకనిష్ఠికముల మీదుగా మంత్రము నుచ్చరింపుచు మంత్రముమీద వదలవలెను. మంత్రమునందు మంత్రదేవతానామమును చతుర్థీఏకవచ నాంతముగాగానీ, ద్వితీయా ఏకవచనాంతముగాగానీ పల్కి "క్షీరేణతర్పయామి" యను పదమును పలుకవలెను. ఈ విధముగా యుక్త సంఖ్యా ప్రకారం క్షీరతర్పణ గావించవలెను. తర్పణానంతరము దశశాంతులు పఠించి తిరగి షోడశోపచారపూజలు నొనర్చవలెను.)

(విశేష సాంప్రదాయ విధానములు గురుగ్రాహ్యములు)

## హోమము

స్వగృహమందుగానీ, దేవాలయ నదీతీరములందు, పుణ్యస్థలము లందుగానీ, సమతలమగు పరిశుభ్ర ప్రదేశమునందు గోమయముచే అలికి, రంగవల్లులు తీర్చిదిద్ది, మధ్యభాగమునం దగ్నికుండమును నిర్మించవలెను. కుండము సమచతురస్రముగానుండి మూడు మేఖలలు, కంఠ నాభి, యోనులను అంగయుక్తమైనదిగా నిర్మించవలెను. భూమినుండి దీనిలోతు 30 అంగుళములు, లోపలికొలత ఎటుచూచినా 24 అంగుళములు కలిగి యుండవలెను. గురుదేవుని పర్యవేక్షణలో పైకొలతలకు తగినవిధముగా మేఖలలు నాభియోని కంఠములు నిర్మించవలెను. యోనిని పశ్చిమ మేఖలలపై ఏర్పాటుచేయవలెను. (కుండనిర్మాణమునందు పొరపాటులుండిన యెడల గొప్ప అరిష్టములు ప్రాప్తించగలవు. కావున అనుభవమున్నవారి ద్వారా



ఈకుండ నిర్మాణము చేయించవలెను) పరిశుభ్రమగు మట్టితో ఆరు అంగుళముల ఎత్తు పదిరెండంగుళములు సమచతురస్రమగు వేదికను నిర్మించి అలంకరించిన యెడల అది స్థండిల మనబడును. కొన్ని సందర్భములలో స్థండలమునందు కూడా హోమము చేయవచ్చును.

సంకల్పము, కుండసంస్కారము, పాత్రాసనాదులతో కూడిన షట్పాత్ర విధానము ననుసరించి, కుండమునం దగ్నిని ప్రతిష్ఠించి యజ్ఞ సమిధులుగా పేర్కొనబడిన మోదుగ, మేడి, రావి, సమిధలచే ఆ అగ్నిని ప్రజ్వలింపజేసి, వేదోక్త విధానము ననుసరించి ముందు ముఖాహుతులు సమర్పించి పిమ్మట యుక్త ద్రవ్యములచే యధా నిర్ధిష్టసంఖ్య ప్రకారం హోమము జేయవలెను. తరువాత ఉపాంగదేవతలకు కూడా తగిన ఆహుతల నొసంగి జయాదిహోమము నొనర్చవలెను. జయాదిహోమమువలన సంకల్పించిన కార్యము వృద్ధినందగలదు. పిమ్మట పత్నీయుక్తుడై శాస్త్రప్రకారము అగ్నిహోత్రు నుద్దేసించి పూర్ణాహుతి నొసంగి అగ్నిని పూజించి సమాప్తము గావించవలెను. ఇది సాధారణ హవనవిధి. విశేష విధానములు తన గురువుద్వారా తెలుసుకొనవలెను.

## వివిధఫలక్రియలు (సాధారణ విధులు)

1. జప, తర్పణ, హోమ, పూజాదుల నొనర్చిన - కోరిన కోరికలు నెరవేరగలవు.
2. జపము, తద్దశాంశము మారేడు పుష్పములచే హోమము గావించిన యెడల-ఐశ్వర్యములభించగలదు.
3. పైవిధముగా మోదుగపుష్పములచే హోమముగావించిన- మేధస్సు, వేదవిదుడు కాగలడు.
4. గరిక లేక తిప్పతీగెలచే హోమము గావించిన-రోగనాశనమై ఆయుర్వృద్ధి కాగలదు.
5. చందనములో జాజిపూలు ముంచి హవనమొనర్చిన - రాజవశ్యము, అధికారవశ్యము కల్గును.

6. జప మొకలక్ష గావించి దశాంశము పేలాలు హోమము మొనర్చిన-శీఘ్రముగా వివాహమగును.

7. పైవిధముగా జపదశాంశము ఎఱ్ఱకలువ పుష్పములతో హవన మొనర్చిన- ఇష్టధనము ప్రాప్తించగలదు.

8. నల్లకలువలచే జగద్దృశ్యము

9. త్రిమధువలతో కూడిన పాయసముచే ఆధిపత్యము

10. తిలతండులఘలిత మిశ్రమములచే - లోకపూజ్యతయు కల్గును.

11. ఎఱ్ఱతామర పుష్పాలు లేక బంధూకపుష్పాలచే హవన మొనర్చిన- సర్వజన వశ్యమగును.

12. సముద్రతీరమునందుగానీ, గోశాలయందుగానీ నివసించి ఆవుపాలు మాత్రమే ఆహారముగా తీసుకొనుచు మంత్రమును లక్షపర్యాయములు జపించి దశాంశము ఆవునెయ్యి కలిపిన పాయసమును హోమము గావించిన విద్యలకు నిధియై వెలుగొందగలడు.

13. సాత్వికాహారుడై మొలలోతు నీటిలో (నదిలో) నిలువబడి లక్షపర్యాయములు మంత్రము జపించి దశాంశము మారేడు దళములతో హోమము గావించిన పోగొట్టుకొనిన ఆధిపత్యమును తిరిగి లభించును.

14. కందమూలములు భుజింపుచు మాఘమాసమునందు నదీ ప్రవాహమునందు నిలబడి లక్షపర్యాయములు జపించి పిమ్మట దశాంశము పాయసముతో హోమముగావించి మిగిలిన పాయసమును దంపతులిర్వురు భుజించిన చక్కని పుత్రుడు కలుగగలడు.

వశ్యము,మోహనము, ఆకర్షణము, స్థంభనము, విద్వేషణము ఉచ్చాటనము, మారణము అనునవి షట్కర్మలు, వీటిని సాధించుటకు కర్మాంగములైన పల్లవములు, కర్మాధిదేవతలు, ఋతుకాలములు, వాసన మొదలగు మంత్రాను సంధాన విషయములు గలవు. వాటిని తమ గురువు ద్వారా తెలుసుకొని మంత్రమునకు జేర్చి ఆయా కర్మలకు దెలుపబడిన ప్రత్యేక విధానముల ననుసరించి జపము-హోమముల నొనర్చిన ఆ యా కర్మలు సిద్ధించగలవు.



మంత్రశాస్త్రమొక ఆధ్యాత్మిక నిధి. దీనిని తెలిసికొనుట సామాన్యులకు చాలా దుర్లభము. గ్రంథములందు వ్రాయబడనివి, వ్రాయకూడనివి అనేక విద్యా రహస్యములున్నవి. వాటిని తెల్పుటకు గురువే సమర్థుడు. గురువులేకుండా అట్టివిషయములు తెలియబడవు. కావున మంత్ర సాధనాభిలాషగల వారు అన్ని విషయములు బాగా తెలిసిన యోగ్యుడు సమర్థుడునగు గురువును ఎన్నుకొని వారి అనుగ్రహమును పొంది వారి అనుమతితో విద్యను సాధించవలెనేగానీ-ఏ మంత్రమునైనా, యంత్రమునైనా, తంత్రమునైనా- ఇతర విధానములనైనా సామాన్య పుస్తకములు జూచి స్వయంగా సాధించ బూనుకొనుట హానికరము మరియు ప్రమాదభరితము కాగలదు. గ్రంథములు విషయములు తెలియని వారికి విషయపరిజ్ఞానము కల్గించుటకు మాత్రమే ఉపయోగపడగలవు. సాధారణ పుస్తకములలో వ్రాసిన ఆసక్తికరమగు ఫలవిషయములకు భ్రాంతినంది తగిన అర్హతలు నియమములు, ఇంద్రియ జయత్వము లేకుండా-గురూపదేశరహితులై స్వతంత్రులుగాను, రహస్యంగాను పుస్తకంలోని మంత్రములు జపించి తమ అమూల్యజీవితములను నాశనమొనర్చుకొనవద్దని- ఈ గ్రంథము అమూలాగ్రముగా పఠించి ఏ ఏ అర్హతలు పొందవలెనో-మంత్ర స్వరూపమేమిటో- ఆచరణానియమ - నిష్ఠలు - నిబంధనలు ఏమిటో? బాగుగాగుర్తెరింగి సక్రమమగు మార్గములద్వారా గురుదేవతానుగ్రహములు పొందుటకై ప్రయత్నించి ఇహపరములయందు సుఖించగలందులకు మనవిచేయుచు ఈ గ్రంథమును ముగించుచున్నాము.

శుభం భూయాత్